నాగర్ కర్నూల్

# శ్రీ లక్ష్మీనృసింహ శతకం

## (అష్టోత్తర శత 'కరోనా' పద్యాలు)



గోవిందు గోవర్ధన్

## శ్రీ లక్ష్మీనృసింహ స్వామి, నాగర్ కర్నూల్



గురుమాత అనుమతితో తీసుకున్న చిత్రపటం

# అంకితం

కం  నూటెనిమిది సీసములను
మేటిగ సరముగను గూర్చి మీ పదములపై
పాటిగ నర్పించితి మా
చేటును తొలగింపుమయ్య శ్రీలక్ష్మీశా!

నాగర్ కర్నూల్

# శ్రీ లక్ష్మీనృసింహ శతకము

(అష్టోత్తరశత 'కరోనా' పద్యములు)



రచన

## గోవిందు గోవర్ధన్

# నాగర్ కర్నూల్
# శ్రీ లక్ష్మీనృసింహ శతకము
(అష్టోత్తరశత 'కరోనా' పద్యములు)

రచన
**గోవిందు గోవర్ధన్**

ప్రథమ ముద్రణ : జూన్ 2020
ప్రతులు : 1000

వెల : అమూల్యం

ప్రతులకు :
గోవిందు గోవర్ధన్,
పాలెం గ్రామం, బిజినపల్లి మండలం,
నాగర్ కర్నూల్ జిల్లా,
తెలంగాణ – 509215.
(Ph. 8106384812)

డి.టి.పి. : కంది శంకరయ్య, హైదరాబాదు.

ముద్రణ : సువర్ణ ప్రింటర్స్, విద్యానగర్, హైదరాబాదు – 44
ఫోన్ : 8978884678
e-mail : upendra.gonela@gmail.com

# విషయసూచిక

**పీఠికలు** **పుట**



**శతకపద్యాలు** **పుట**




**కంది శంకరయ్య**

'శంకరాభరణం'
బ్లాగు, వాట్సప్ సమూహాల నిర్వాహకుడు.


# సమగ్ర శతకం

తెలుగులో శతక సాహిత్యానిది విశిష్టస్థానం. వేలకొలదిగా వెలువడ్డ, వెలువడుతున్న శతకాలలో భక్తికి, నీతికి సంబంధించినవే ఎక్కువ. సామాజికాంశాలను స్పృశించిన శతకాలు కూడా ఉన్నవి. ముక్తక లక్షణం, ఆత్మాశ్రయ కవిత్వం కలిగిన శతకాలలో కవులు తమ కాలానికి చెందిన సామాజికాంశాలను ప్రస్తావించకుండా ఉండలేరు. సమకాలీన సమస్యలకు స్పందించిన కవి వాని మూలాలను, విస్తృతిని వివరించి పరిష్కార మార్గాలను సూచిస్తాడు. అందుకు కచ్చితమైన ఉదాహరణం ఈ కరోనా కల్లోలంపై వ్రాసిన ఈ 'లక్ష్మీనృసింహ శతకం'.

ఈ శతకంలో నృసింహుని, ఇతర దేవతలను స్తుతిస్తూ కరోనా నుండి కాపాడమని వేడుకొనడంలో భక్తి ఉంది. నవవిధ భక్తిమార్గాలలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క పద్యం చొప్పున ఉన్నాయి. ఈ విపత్కర సమయంలో ప్రజలు ఎలా మసులుకోవాలో చెప్పే నీతులు ఉన్నాయి. అధిక్షేపాలు, వ్యాజనిందలు కోకొల్లలు. ఆ విధంగా ఇది ఒక సంపూర్ణ సమర్థ శతకంగా రూపుదిద్దుకున్నది.

గోవర్ధన్ గారు కరోనాపై శతకం వ్రాస్తున్నట్లు చెప్పినపుడు ఇదేదో కంద పద్యాలతోనో, తేటగీతులతోనో సిద్ధమౌతున్నదనుకున్నాను. అయినా శతకం వ్రాయదగినంత విషయ విస్తృతి ఎక్కడుంది అని అనుమానించాను. పునరుక్తు లుంటాయనుకున్నాను. కాని దీనిని సీసపద్యాల శతకంగా చూచి విభ్రాంతికి లోనయ్యాను. భావపుష్టి లేకుండా సీసపద్యాన్ని వ్రాసి మెప్పించలేము. మొత్తం శతకం చదివిన తర్వాత గోవర్ధన్ గారి కవన సామర్థ్యం, కథన నైపుణ్యం అవగత మయ్యాయి. ఎక్కడా పునరుక్తి లేకుండా, భావసంపదకు లోపం లేకుండా సరళమైన భాషలో శతకాన్ని నడిపించారు. ప్రతి పద్యానికి ఒక ఉపశీర్షిక పెట్టడం మరొక ప్రత్యేకత. ఈమధ్య కాలంలో నేను చదివిన ఆధునిక శతకాలలో ఇది ఉత్తమమని ఘంటాపథంగా చెప్పగలను.

ఈ శతకాన్ని రచించిన గోవర్ధన్ గారికి అభినందనలు.

కంది శంకరయ్య




## డా. వెలుదండ సత్యనారాయణ

పరమార్థ కవి


# యుక్తాహార విహారస్య...

**సమకాలీన సమాజా**
**సమ రోగ విజృంభణమ్ము సాగిన తీరున్**
**క్రమముగను విన్నవించెను**
**విమలుడు గోవర్ధన కవి విష్ణున కిటులన్.**

ప్రస్తుతం ప్రపంచాన్నంతా చుట్టుముట్టి అతలాకుతలం చేస్తున్న కరోనా వ్యాధిని గురించి భవిష్యత్తులో విభిన్నకోణాల నుంచి మరింత తెలుసుకోగోరిన వాళ్ళకోసం చి. గోవర్ధన్ వ్రాసిన 'నాగర్ కర్నూల్ శ్రీ లక్ష్మీనృసింహ శతకము' ఉపకరిస్తుంది.

సామాజికస్పృహతో పాటు దైవభక్తిని మేళవించుకున్న మనస్తత్వం గలిగిన చి. గోవర్ధన్ లక్ష్మీనృసింహునికి కరోనా గురించి తనకు తోచిన అనేకరీతులలో విన్నవించుకున్నాడు.

కృష్ణుడు గీతలో "యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు..." అని పేర్కొన్నాడు. అంటే ఉచితమైన ఆహారపు టలవాట్లు, విహారాలు అంటే సంచరించడాలు ఉండాలని కృష్ణుని అభిమతం. ఆహారా విహారాలనే అంశం ప్రాథమికమే అయినా ఎంతో విశాలం. వాటిని పాటించకపోతే ఏం జరుగుతుంది? అంటే ఇప్పుడు జరుగుతున్నదే! ప్రాణానికి ముప్పే! దీన్ని మానవాళికి గుర్తు చేయడానికే ప్రకృతి కరోనాను మన ముందుకు తెచ్చిందేమో? గుణపాఠం ఇప్పటికైనా నేర్చుకొనండని ఘనపాఠం చెప్పిందేమో?

ఇక అప్పుడు జాగ్రత్త పడాలనుకున్న ప్రతి యొక్కడూ గోవర్ధన గిరిధారి యైన కృష్ణుని వద్దకు పరుగెత్తాల్సిందే! సమాధానం అక్కడే దొరుకుతుంది. ఆ సమాధానమే లోకానికి సముచితమైన ఔషధం. ఆ ఔషధాన్ని ఐదువేల సంవత్సరాల క్రితమే కృష్ణుడు లోకానికి అందించాడు. అందుకే కృష్ణస్వరూపుడే అయి ఉన్న నృసింహస్వామిని కవి వేడుకున్నాడు ఈ రోగాన్ని నిర్మూలించమని.

చైనీయుల భయంకరమైన ఆహారపు టలవాట్లే ప్రపంచానికంతా తలనొప్పిగా పరిణమించాయని లోకం కోడై

కూస్తున్నదిప్పుడు. జనావళి మృత్యుభయంతో అల్లల్లాడిపోతున్నది. ఆ భయాన్ని తొలగించాలంటే భయహారియైన భగవానునే ఆశ్రయించాలి.

చి. గోవర్ధన్ ఈ కృతి ద్వారా ఆపనే చేశాడు. అనేక శీర్షికలతో అనేక కోణాలనుంచీ కవి తన ఆవేదనను, ఆర్తినీ ఆవిష్కరించాడు. నరహరికి విన్నవించాడు. అశ్వినీ దేవతలను, ధన్వంతరిని, చరక సుశ్రుతులను, జగన్మాతను, గరుత్మంతుని, శ్రీశైలవాసుని, దశావతారాలను ప్రార్థించాడు కవి. ముక్కోటి దేవతలనూ ఆర్తితో ప్రశ్నించాడు కవి. చివరికి నారదునికీ చెప్పుకున్నాడు కరోనా విషయం విశ్వనాథునికి చెప్పరాదా అంటూ. ఆయన త్రిలోక సంచారి కదా! వార్తాహరుడు కదా! అంతే కాదు... ప్రధాని నరేంద్ర మోదీ సేవలను ప్రస్తుతించాడు. ఆశా, అంగన్ వాడి, మునిసిపాలిటీ సిబ్బంది, పోలీసుల, వైద్యుల సేవలను కొనియాడాడు. వలస కూలీల దురవస్థలను స్మరించినాడు.

ఇంకా నవవిధ భక్తులతో నరసింహుని కీర్తించినాడు. వేంకటేశ్వరునికి విన్నవించుకున్నాడు. సూర్యుణ్ణీ స్తుతించాడు. అందువల్ల 'సర్వే జనాః సుఖినో భవంతు' అని లోకక్షేమాన్ని కాంక్షించి కవి రచించిన కృతి యిది అని భావింపవచ్చు. ఈ స్పందన ఇలాగే వరిస్తూ ఉండాలనీ, చి. గోవర్ధన కవి లేఖిని నుంచి అనేక కృతులు ఇంకా అవతరించాలని హృదయపూర్వకంగా ఆకాంక్షిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

**కరుణించు గాక లక్ష్మీ**
**నరసింహుడు శుభము లిచ్చి, నాగర్ కర్నూల్**
**పురమందున గోవర్ధను**
**స్థిరచిత్తము నొసగి కవనసిద్ధి నొసగుచున్.**

విజయపురి కాలనీ, హైదరాబాద్. తేదీ. 9-05-2020.

స్వామి సేవలో...
డా. వెలుదండ సత్యనారాయణ
పరమార్థ కవి



**డా. జి. శ్రీనివాస రావు,**
సహాయ ఆచార్యులు, తెలుగు శాఖ,
ప్రభుత్వ డిగ్రీ కళాశాల, పటాన్‌చెరు.

# పద్యాల జలపాతం - కరోనాకు అశనిపాతం

అత్యంత మృదుస్వభావులు, అంతర్ముఖులు, ఆధ్యాత్మిక చింతనాపరులు అయిన గోవర్ధన్ గారు కేంద్రీయ విశ్వవిద్యాలయంలో చదువుకున్నప్పటి నుండి నాకు మంచి మిత్రులు. పద్యరచనా నైపుణ్యంలో అందె వేసిన చేయి. అలవోకగా పద్యాలు చెప్పడంలో దిట్ట.

ఇంతకు పూర్వం 'పాలెము వేంకటేశ శతకము, ప్రసన్నాంజనేయ శతకము' రచించినారు. ఇది మూడవది. వీరు రచించిన ప్రతిపద్యం నా వాట్సాప్‌లో తాజా పుష్పమై ప్రత్యక్షమౌతుంది.

గోవర్ధన్ గారి కవిత్వానికి ఎన్నో విశిష్టతలున్నాయి. కొన్నింటిని ఇక్కడ పేర్కొంటాను. జనవ్యవహారంలో నలిగిన జానుతెనుగు పదాలు వాడడం వీరి శతకానికే వన్నె తెస్తుంది. అలతి పదాల వలన అర్థం సులభగ్రాహ్యమౌతుంది. పద్యాలకు శీర్షికల నివ్వడం ఈ శతకానికొక ప్రత్యేక ఆకర్షణ. ఏయే అంశాల గురించి వర్ణించారో పాఠకుడు ముందుగానే తెలుసుకొనే అవకాశం ఉంది. గోవర్ధన్ గారి పద్యాలు జలపాతంలాగా దూకుతుంటాయి. పద్యాలు చదువుతూ ఉంటే పాఠకుణ్ణి వేగంగా ముందుకు తీసుకెళ్తూ ఉంటాయి.

చైనాలో పుట్టి యావత్ ప్రపంచాన్ని గడగడ వణికిస్తున్న కరోనా వైరస్ వల్ల కలచివేయబడ్డ హృదయంతో రచించిన శతకమిది.

ప్రహ్లాదుని ప్రార్థన ఆలకించి హిరణ్యకశిపుని చంపిన నరసింహుడు, గోవర్ధన్ గారి ప్రార్థన నాలకించి 'కరోనా వైరస్'ను అంతమొందించి, అన్ని దేశాల ప్రజలను కాపాడతాడని ఆశిస్తూ, ఇంత మంచి శతకం వ్రాసిన గోవర్ధన్ గారిని అభినందిస్తూ, ఇంకా ఎన్నో రచనలు చేయాలని మనస్ఫూర్తిగా కోరుకుంటూ...

భాగవత విధేయుడు
డా. జి. శ్రీనివాస రావు



**జి. రవికిరణ్**

జె. కె. సి మార్గదర్శి

# కృషి అభినందనీయం

ఎన్నో విపత్తులను ఎదుర్కొన్న ప్రపంచ మానవాళి కరోన ననుచుటలో కుదేలైపోయింది. ఎప్పటికప్పుడు ఈ జీవి తన రూపు మార్చుకుంటూ విరుచుకుపడుతుంది. అతి సూక్ష్మమైన ఈ జీవి అత్యంత భారీ నష్టాన్ని కలిగిస్తుంది. ఎందరో ఎన్నోన్నో అవస్థలు పడుతున్నారు. ఉన్న ఊరిని కన్నవారిని చేరుకోవడానికి వేల మైళ్ళ దూరం నడుస్తూ అగచాట్లు పడుతున్న వలసజీవులు.. రెక్కాడితే కానీ డొక్కాడని పేదవాడు ఆకలితో అలమటిస్తున్నారు..

కష్టించే కార్మికుల చేతులకు సంకెళ్లు వేసినట్టు..

పనిలేక..

తిండిలేక..

ఎన్నేన్నో వర్ణించలేని హృదయవిధారక సంఘటనల సమాహారం ఈ లోక్డౌన్ రోజులు..

సాంకేతికతతో మనిషి మనిషికి తలపెట్టిన ముప్పు నుండి ఆ భగవంతుడే మనల్ని రక్షించాలని ప్రపంచ మానవాళి తరుపున శ్రీ నృసింహ స్వామికి పద్యరూపంలో విన్నవించిన మీ కృషి అభినందనీయం.

ఇది కేవలం మీ సాహిత్య ప్రతిభ కాదు.మానవాళి సమస్యను లోతుగా చూడగలిగిన ఓక జ్ఞానిగా పాఠకుల మనసులో, స్వామి కృపకు పాత్రులవుదురు.

మీ అసమాన్య సాహితీ ప్రతిభతో జనులకు కరోనతో జనులు పడుతున్న కష్టాలను వర్ణించిన తీరు అద్భుతం.

ఇవే మీకు మా అభినందనలు.

జి. రవికిరణ్

# మనస్సంకల్పం

2018 ఆగష్టు నెలలో నా హృదయంలో కొలువై యున్న పాలెం ప్రసన్నాంజనేయుని శతకమును వ్రాయసంకల్పించాను. అంతకు ముందే పాలెం గ్రామానికి చెందిన శ్రీ బానూరి యాదయ్య గారు నాగర్ కర్నూల్ లోని కొల్లాపూర్ చౌరస్తాకు ఉత్తరదిశలో  వెలసిన లక్ష్మీనరసింహస్వామి దేవాలయమును గురించి, స్వామి మహిమల గురించి అప్పుడప్పుడు నాకు వినిపించి స్వామిని దర్శించుకోమని సూచనలు చేశారు. యాదృచ్ఛికంగా ఆగష్టు నెలలో 2వ శనివారం ఉదయం 9 గంటలకు ఇద్దరం కలిసి  లక్ష్మీనృసింహస్వామి దేవాలయమునకు చేరుకున్నాము.

స్వామి మందిరము పచ్చని పంటపొలాల మధ్యన ఆహ్లాదకరమైన వాతావరణములో నా మనస్సునకు ఎంతో ప్రశాంతతను కలిగించింది. అప్పుడే  స్వామిని స్మరిస్తూ ఒక శతకము వ్రాయాలనే సంకల్పం నా హృదయంలో మెదిలింది. అంతలోనే నాగర్ కర్నూల్ వాస్తవ్యులు ఈ దేవాలయ ధర్మకర్త గౌరవనీయులైన శ్రీమతి కాశింశెట్టి విజయలక్ష్మి (గురుమాత ) గారు స్వామి గుడిలోకి ప్రవేశించారు. అంతకు ముందు గురుమాతతో నాకు పరిచయం లేని కారణం చేత నన్ను నేను పరిచయం చేసుకొని పాలెం ప్రసన్నాంజనేయ శతకము వ్రాయుటకు సంకల్పించానని విన్నవించాను. గురుమాత స్పందిస్తూ శీఘ్రమే పూర్తౌతుంది. అలాగే లక్ష్మీనృసింహ స్వామి చరిత్రను పద్యాలలో కాకుండ వచనరూపంలో వ్రాయండని ఆజ్ఞాపించారు. స్వామి కృప ఉంటే ప్రయత్నం చేస్తానని విన్నవించాను. గురుమాత ఒక పెన్ను (కలము) స్వామి పాదాల చెంత ఉంచి నాపేర అర్చన కూడా చేసి నిండుగా దీవించారు.

ఆరోజు నుండి పాలెం ప్రసన్నాంజనేయుని స్మరిస్తూ  ప్రతిరోజు పద్యాలు వ్రాస్తూ దాదాపు నెలరోజులలోపే శతకం పూర్తిచేసి నాకు పరిచయమున్న గురువులు, పండితుల చేత పీఠికల రూపంలో ఆశీర్వచనాలను పొంది ముద్రించడానికి పంపించాను. ఇంతలోనే 2020 మార్చినెలలో ప్రపంచమును గడగడలాడిస్తున్న కరోనా భూతంనుండి ప్రజల ప్రాణాలను రక్షించడానికై  భారత దేశ మంతట లాక్ డౌన్ అమలు చేస్తూ విద్యాసంస్థ లన్నింటికి సెలవులు ప్రకటించారు

ఈ సెలవు రోజులను ఎలా గడపాలని ఆలోచిస్తుండగా కంటికి కనిపించని చైనా కరోనా వ్యాధిని నిర్మూలించుట దుష్టశిక్షణ, శిష్టరక్షకుడైన శ్రీపరాత్పరుడు తప్ప మానవమాత్రులకు సాధ్యము కాదనిపించింది. నాగర్ కర్నూల్ లక్ష్మీ నృసింహ స్వామి నా కనుల ముందు సాక్షాత్కరించి స్వామి పేర శతకము వ్రాయమని ఆజ్ఞాపించినట్లుగా తోచింది. వెంటనే స్వామి మకుటంతో కరోనా వ్యాధిని నిర్మూలింపుమని వేడుకుంటూ 9/3/2020 నాడు సీసపద్యాలతో ప్రారంభించగా 18-4-2020 నాటికి 108 పద్యాలతో శతకం ముగిసింది. శతకం ప్రారంభించడానికి ముందు నేను ఏర్పరచుకున్న

**"క్రూరమైనట్టి చైనా కరోన నణచి**
**చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ"** అనే ద్వి పాద మకుటాన్ని

నా పద్య గురువైన డా|| వెలుదండ సత్యనారాయణ గారికి,.గురువర్యులు శంకరాభరణం వాట్సప్ సమూహ నిర్వాహకులు శ్రీ కంది శంకరయ్య గారికి పంపి వారి సూచనల మేరకు అదే మకుటాన్ని స్థిరపరచుకొని ప్రతి రోజు కరోనాపై వస్తున్న వార్తలను చూస్తూ వాటికి సంబంధించిన పద్యాలను వ్రాస్తూ, పద్యాలకు సంబంధించిన సందేహాలను నివృత్తి చేసుకొనుటకై ప్రతి పద్యాన్ని పద్య రచనలో పట్టు ఉన్న హైదరాబాద్ కేంద్రీయ విశ్వ విద్యాలయంలో మా సీనియర్ ప్రస్తుతం పటాన్ చెరు ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో తెలుగు ఉపన్యాసకులు డా|| శ్రీనివాసరావు గారికి పంపించాను. వారు ఏమాత్రం విసుగు చెందకుండ పద్యాలన్నింటిని పరిశీలించి సవరిస్తూ నన్ను అభినందిస్తూ ముందుకు నడిపించారు. పద్యాలు వ్రాస్తున్నప్పుడు నా దృష్టికి రాని అనేక విషయాలను ప్రతిరోజు అంశాల వారిగా సూచనలు చేస్తూ నా వెన్నంటి నిలిచి ముందుకు నడిపించిన నాతోటి అధ్యాపకుడు ఆత్మీయ సోదరుడు శ్రీ కొత్త గోవర్ధన్ గారు 108 పద్యాలయ్యేంత వరకు ఎంతగానో సహకరించారు. వీరితో పాటు ఆత్మీయ సోదర, సోదరీ మణులు సాహితీప్రియులైన సొప్పరి కాశన్న, శ్రీమతి రాధాకుమారి, శ్రీ రవికిరణ్, మా సహోదరి శ్రీమతి జి. శ్రీదేవి గారలకు పంపించాను.

వీరందరు నేను పంపించిన పద్యాలను చదివి ప్రశంసిస్తూ ప్రోత్సహించారు. శ్రీ సొప్పరి కాశన్న ప్రతి పద్యాన్ని పరిశీలించి చక్కని భావంతో సరళమైన భాషతో పాటు చక్కని ధార కూడ ఉన్నాయని అభినందిస్తూ ముందుకు నడిపించారు.

శతక పద్యాలు పూర్తైన తరువాత శ్రీ కంది శంకరయ్య గారితో శతకమును పరిష్కరించి ఆశీర్వదించండని విజ్ఞప్తి చేశాను ఉమ్మడి రాష్ట్రంతో పాటు భారతదేశంలోని ఇతరరాష్ట్రాలలో ఉన్న సాహితీ ప్రియులందరికి అనునిత్యం శంకరాభరణం వాట్సప్ సమూహం ద్వారా పద్యాలు నేర్పిస్తూ అవధానాలు నిర్వహింప చేస్తున్నారు కాబట్టి వీలుకాదని అంటారేమో అనుకున్నాను. కాని గురువు గారు సహృదయంతో స్పందిస్తూ పరిష్కరించి ఆశీర్వదించుటకు అంగీకరించారు. గురువు గారి అనుమతి గైకొని పద్యాల నన్నింటిని వారి సూచన మేరకు వాట్సప్ ద్వారా పంపించాను. గురువు గారు సాహితీ యజ్ఞంలో నిమగ్నమై క్షణం తీరిక లేకున్నప్పటికి నేను పంపించిన శతక పద్యా లన్నింటిని పరిశీలించి సవరణలు చేసి, శతకానికి చక్కని స్వరూపం వచ్చేటట్లుగా తీర్చి దిద్ది "సమగ్రశతకము" పేర నన్ను ఆశీర్వదించారు. వీరికి ఎల్లప్పుడుఋణపడి ఉంటాను.

నా విజ్ఞప్తిని మన్నించి నా పద్యగురువు డా॥ వెలుదండ సత్యనారాయణ గారు సహృదయంతో శతకమును పరిశీలించి "యుక్తాహార విహారస్య" అంటూ మనసారా ఆశీర్వదించారు. వీరి ఆశీర్వచనాలు నా వెన్నంటి నిరంతరం రక్షిస్తూ సాహితీరంగంలో భక్తిమార్గంలో ముందుకు నడిపిస్తున్నాయి.

శతకరచనకు తోడ్పడిన సాహితీ ప్రియులు, సాహితీ పోషకులందరిని ఆపరాత్పరుడు శ్రీ లక్ష్మీ నృసింహుని చల్లని చూపులు ఎల్లవేళలా ప్రసరిస్తూ, ఆయురారోగ్యాలతో కాపాడుతూ దినదినాభివృద్ధిలో నడిపిస్తూ ఉంటాయని విశ్వసిస్తూ. వారందరికి హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియచేస్తూ భవిష్యత్తులో వీరి సహకారం ఇలాగే ఉండాలని ఆకాంక్షిస్తున్నాను.



కృతికర్త
గోవిందు గోవర్ధన్

# నాగర్ కర్నూల్ శ్రీ లక్ష్మీ నృసింహస్వామి దేవాలయం

## నిర్మాణము - నిత్యపూజలు - మహిమలు

శ్రీ లక్ష్మీనరసింహ స్వామి దేవస్థానం నాగర్ కర్నూల్ జిల్లా కేంద్రంనుండి 5 కి.మీ దూరంలో గల కొల్లాపూర్, అచ్చంపేట చౌరస్తాకు సమీపంలో ఉత్తరదిక్కున 1 ఎకరా 13 కుంటల విస్తీర్ణంలో నిర్మింపబడింది

శ్రీమతి కాశింశెట్టి విజయలక్ష్మి (గురుమాత) గారి సంకల్పంతో భక్తుల సహాయ సహకారాలతో స్థలాన్ని కొని 'నరసింహ పురి' అని నామకరణం చేసి 2015 వ సం॥లో శంకుస్థాపన చేసి, స్వామి విగ్రహం నిష్ణాగరిష్ఠులైన శిల్పులచేత రూపొంది, 23-6-2018 నాడు ప్రతిష్ఠ చేయబడినది.

ఈ క్షేత్రంలో విజయ గణపతి, నవగ్రహాలు, సంతాన నాగులు, గరుడవాహనం, క్షేత్రపాలకుడైన అభయాంజనేయస్వామి ఒంటె వాహనంతో అభిముఖంగా ప్రతిష్ఠింపబడినవి. అష్టముఖి తులసి బృందావనం అత్యంత ప్రతిష్టాత్మకంగా శిలతో ఏర్పాటు చేశారు.

ఎంతోమంది భక్తులు అనునిత్యం స్వామిని దర్శించుకొని తమ బాధలు విన్నవించుకొని కోరికలు తీర్చుకొని సుఖసంతోషాలతో వెలుగొందుచున్నారు.

ప్రతిసంవత్సరం స్వామి జయంతి, వార్షికోత్సవం, గణపతి నవరాత్రులు, దేవీ నవరాత్రులు, కార్తీక దీపోత్సవాలు, సంక్రాంతికి గిరి ప్రదక్షిణ కార్యక్రమాలు అంగరంగవైభవముగా నిర్వహిస్తున్నారు. ప్రతి శనివారం గుడిని దర్శించుకునే భక్తులకు అన్నదాన కార్యక్రమం నిర్వహిస్తున్నారు. స్వామి వార్శికోత్సవాన్ని 15/20మంది భక్తులు దీక్షావస్త్రాలు ధరించి స్వామి సన్నిధానమునుండి పాదయాత్రగా బయలుదేరి 102 గ్రామాలు చేరుకొని భక్తులొసగిన విరాళాలతో నిర్వహిస్తున్నారు.

దేవాలయము సింహాకృతిలో నిర్మింపబడినది .

స్వామివారికి ఉదయం సుప్రభాత సేవ, రాత్రి 8.00 గం.లకు పవళింపు సేవలు నిర్వహించుచున్నారు.

ఈ దేవాలయానికి శ్రీమతి కాశింశెట్టి విజలక్ష్మి (గురుమాత) గారు వ్యవస్థాపక ధర్మకర్తగా వ్యవహరిస్తున్నారు.

# శ్రీ లక్ష్మీ నృసింహ శతకం

## (అష్టోత్తరశత 'కరోనా' పద్యములు)



### విఘ్నేశ్వరుని ప్రార్థన

సీ. శ్రీకరా! భువిపైకి శీఘ్రమే రావయ్య
ప్రథమ గణాధిప! పార్వతిసుత!
కరిముఖా! మా బొజ్జ గణపయ్య! దయతోడ
విఘ్నాలు తొలగించు విబుధవర్య!
తుంటరి క్రిమి నేడు తొడగొట్టి ప్రాణాలు
కబళించుచున్నది కర్కశముగ
నాగరకందనూల్ నరసింహ దేవుని
నామమే మకుటమై నేమముగను

తే.గీ. సీసపద్యాల సుమములన్ సేకరించి
లోక రక్షణార్థము కోరి ప్రాకటముగ
స్వామి పాదపద్మాలను ప్రస్తుతించి
శతక రూపము నందింతు సంతసమున.

**1. దైవప్రార్థన**

సీ. శ్రీకరా! శుభకరా! చిన్మయరూపుడా!
చేరి కొల్చితినయ్య! చిద్విలాస!
శ్రీహరీ! మమ్మేలు శ్రితజన మందార!
నిత్యము స్మరియింతు నీరజాక్ష!
శ్రీలక్ష్మి విభుడవై చేరినావట భువిన్
ధనుజులన్ దండించి ధర్మతేజ!
శ్రీలను కురిపించి చింతలన్ తొలగించి
భక్తులన్ బ్రోచిన భానుతేజ!

తే.గీ. కందనూలున వెలసిన ఘన సురూప!
కూర్చి యిచ్చెద శతకము కోర్కె మీర
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**2. కరోనా జన్మస్థానము**

సీ. దేశానికీశాన్య దిక్కున పరదేశ
భూభాగమున పుట్టి బుగులు లేపె
కోవిదు నామాన కోరలుచాచుచు
వసుధపై శీఘ్రమే వ్యాప్తినొందె
భయవార్ధిలో ముంచి ప్రాణాలు కబళింప
విహరించుచున్నది విచ్చలవిడి
నేలపైన కరాళ నృత్యము చేయుచు
నెగబ్రాకుచున్నది విగళితముగ

తే.గీ. దాని కోరలన్ పెకలింప ధైర్యముగను
వైద్యులెల్లరు పూనిరి వసుధపైన
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 3. మందుకనిపెట్టుటకై ప్రయత్నం

సీ. విశ్వమున్ వణికించె వింత కరోనాష్ట
దిగ్బంధనము చేసె దేశములను
రాకపోకలనాపె లోకము స్తంభించె
విందు వినోదాల వీడ జేసె
ప్రజలు గృహాలకు పరిమితంబై గడ్ప
దాటకుండగ జేసె దారుణముగ
దిక్కుదిక్కులనున్న దేశాల యేలిక
లాంక్షలన్ విధియించి రాత్రృతముగ
తే.గీ. మాయరోగము నాపెడి మందు నిపుడు
సృష్టి చేయుట కొరకయి దృష్టి నిడిరి
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 4. స్వీయ నిర్బంధం

సీ. పాఠశాలలుమొదల్ ప్రముఖ విద్యాలయాల్
ముచ్చెమటలు బుట్టి మూసివేసె
అంటి ముట్టక జనులత్యంతము బెదరి
కరచాలనమ్ముల మరువజేసె
సంబంధ బాంధవ్య సంఘసమూహాల
విధి వ్రాతగా మారి వీడ జేసె
కటకటా! వాపోయి తటతట హృదయాల
యముని దూతగ నెంచ నదుర జేసె
తే.గీ. మందుమాకులతో వ్యాధి మట్టుబెట్ట
సాధ్యమౌనొ కాదో నేడు సారసాక్ష!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**5. వీరబ్రహ్మంగారి కాలజ్ఞానం**

సీ. వీర బ్రహ్మేంద్రుడు విశ్వాన రాబోవు
వింతల నెల్లను విరివిగాను
దివ్యదృష్టిని కాంచి భవ్యకాలజ్ఞాన
మెరిగించెను పుడమి నెల్లరకును
సకలచరాచర జగముపైన నజుడు
ధర్మరక్షణకై యధర్మ మణచ
నద్భుతంబులనెల్ల నుద్భవింపను చేసి
మాయరోగాలతో మట్టుబెట్ట
తే. అవతరించును తప్పక యని నుడివెను
నాటినుండియు కొనసాగె నేటివరకు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**6. వికారి నామ సంవత్సర ఫాల్గుణమాసము**

సీ. కంపింప జేసె వికారి వత్సరమందు
ఫాల్గుణమాసము ప్రజ యెదలను
వింత కరోనాయె విశ్వాంతరాళాన
సూక్ష్మరూపము దాల్చి సులభముగను
వాయువున్ మిళితమై వసుధపై వ్యాపించి
పీల్చిన వారలన్ పిప్పిచేసె
కడు జాగరూకులై కదలిరీ వ్యాధిని
దరిచేరనివ్వక దారివెంట
తే.గీ. మరువకుండగ చేతి రుమాలు నెపుడు
మూతి ముక్కుల కడ్డము ముడుచుకొనిరి
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**౭. పుణ్యక్షేత్రాలు పాక్షికంగా మూయుట**

సీ. జనసంద్రమై యుండు సద్భక్తి కేంద్రాలు
దర్శించు భక్తులన్ తగినరీతి
కార్యనిర్వాహకుల్ కట్టడి చేయుచు
కమలాక్షునర్చించి కదలుడనిరి
ప్రాంగణాలత్యంత పరిశుభ్రముగ నుంచి
సహకారమందించి సాగు దనిరి
పిల్లపాపలతోడ నెల్లరు సుఖముగా
కోర్కెమీరగ రండు గుడులకనిరి

తే.గీ. దేవదేవుని దివ్యమౌ దృష్టి సోకి
వ్యాధులన్నియు తొలగును వసుధననిరి
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మినృసింహదేవ!

**8. దేవాలయాలు, ప్రార్థనాకేంద్రాలు ఏకాంత సేవలో కొనసాగుట**

సీ. భక్తికేంద్రాలును ప్రార్థనానిలయాలు
ముందుజాగ్రత్తగా మూయుడనిరి
అభయమందించెడి యభవునేకాంతము
సేవలన్ వీడక చేయుడనిరి
పిల్లలన్ వృద్ధులన్ ప్రేమగా నింటిలో
బంధింప పెద్దల బాధ్యతనిరి
పౌరులెల్లరుకూడ దూరప్రయాణాలు
మానుట నత్యంత మంచిదనిరి

తే.గీ. పుడమి యల్లకల్లోలమై పోయె నయ్య!
వ్యాధి నిర్మూలనము చేయు వైద్యు డెవరు?
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మినృసింహదేవ!

**౯. శరణాగతి**

సీ. వైకుంఠ కైలాస వాసులారా నేటి
విశ్వవిపత్తును వినగలేర
విలవిలలాడించె వింత కరోనాను
నరికట్టనరుదెంచు డవనిపైకి
ధరణిపై భక్తుల మొరలాలకించుడు
దయతోడ శీఘ్రమే తరలిరండు
అణువణువున నుంటిరని వింటి మిమ్ముల
నవవిధభక్తుల నమ్మకములు
తే.గీ. వ్యాస వాల్మీకి పోతన భక్త కవులు
చాటి చెప్పిరి మీపాద శరణములను
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**10. ప్రకృతి ప్రకోపించుట**

సీ. సంస్కారహీనతన్ చైనీయులెల్లరు
జీవించడానికై సృష్టిలోని
ప్రతిజీవరాశిని భక్షించుచుండగా
ప్రకృతి ప్రకోపించి పాపమనక
వ్యాధిని సృష్టించి ప్రజల ప్రాణాలను
బలిగొనుచున్నది పట్టు విడక
విశ్వాంతరాలమున్ వేగమే చుట్టియు
వణికించుచున్నది వసుధనెల్ల
తే.గీ. రోగమంతట ప్రాకె 'కరోన' పేరు
వినగ భయకంపితము నొందె విశ్వమెల్ల
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

## 11. ప్రధానమంత్రి నరేంద్ర మోదీ పిలుపు

సీ. ప్రజలు కరోనాను పతనమొనర్చను
స్వీయనిర్బంధమున్ స్వీకరించి
దేశరక్షణకోరి దిగులులేకుండగ
సాగువైద్యులకెల్ల సహకరించి
నేలపై వ్యాధిని నిర్మూలనముజేసి
సంతోషభరితులై సాగుడనుచు
పిలుపునిచ్చెనుదేశ పెన్నిధైననరేంద్ర
మోది యాదేశముల్ ముదముతోడ

తే.గీ. భరత ఖండము లోనున్న పౌరు లెల్ల
రైకమత్యముచాటుచు నడుగులిడిరి
క్రూరమైనట్టి చైనాకరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీ నృసింహదేవ!

## 12. వైద్యో నారాయణో హరిః

సీ. ప్రాణాంతక కరోన ప్రకృతిని మిళితమై
చిందులు వేయుచు చెలగుచుండె
వసుధపై నెందరో వైద్యనారాయణుల్
ప్రజలరక్షణ కోరి ప్రతిభతోడ
కూకటి వ్రేళ్ళతో కూల్చి కోరలు పీకి
మట్టు బెట్టగనెంచి పట్టు విడక
వ్యాధిగ్రస్తులకెల్ల వైద్య మందించిరి
శ్రమకోర్చుకొనుచు విశ్రాంతి లేక

తే.గీ. దృష్టి నిలిపినారౌషధి సృష్టికొరకు
దైవదూతలవలె నిల్చి ధైర్య మిడిరి
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 13. అశ్వినీ దేవతలకై విజ్ఞప్తి

సీ. సృష్టిరహస్యాలుఛేదింప శక్యమా
విజ్ఞానమెంతేని వెలుగుచున్న
క్రిమి సూక్ష్మముగ బుట్టి కెరలి విజృంభించి
మరణ మృదంగమై మసలె నేడు
మృత్యురూపము దాల్చి కృత్యముల్ సాగించి
అడలెత్త జేసెను విడువకుండ
అవనిపై వైద్యుల కంతుచిక్కుట లేదు
వలపన్ని బంధింప నలవికాక

తే.గీ. దేవవైద్యుల నశ్వినీ దేవతలను
స్వాగతింపుము భువిపైకి సాహసాంగ
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 14. వల్లకాడుగా మారిన ఇటలీ దేశము

సీ. వికటాట్ట హాసాన విశ్వమంతట నిండి
ప్రాణాలు కబళింప ప్రాకులాడె
ఇటలీని నడుగిడె నెటు చూచిననుకాని
పీనుగు పెంటలన్ పేర్చి నిలిపె
దేశమందధినేత దిగులునొందుచు హృదిన్
ప్రజల సంరక్షింప పరుగులిడుచు
వైద్యమందింప మా వల్లకాదనుచును
నిస్సహాయత కంట నీరు నింపె

తే.గీ. సంక్రమించిన వ్యాధిని సంహరింప
ధరణి మానవ మాత్రుల తరమునౌన?
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 15. దేశమంతటా స్వీయ నిర్బంధం మొదటిరోజు

సీ. ఇంటి గుమ్మము దాటి చంటిపిల్లలు గూడ
మరచి వీధులయందు మసలలేదు
మందు విందుల రుచి మరిగి బానిసలైన
కలహప్రియులు కాలు కదపలేదు
రెక్కాడినను కాని డొక్కాడని జనులు
నిలిచియుండిరి తమ నెలవులందు
పల్లెలు పట్టణాలెల్ల వీధులయందు
నిశ్శబ్ద మేలెను నిక్కముగను
తే.గీ. ఇంట నిరువది నాలుగు గంటలుగను
గడిపిరెల్లరు వ్యాధిని కడను తేర్చ
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీ నృసింహదేవ!

### 16. ధన్వంతరి చరక సుశ్రుతులను ప్రార్థించుట

సీ. ఏకాకిగాను భూలోక రక్తము గ్రోల
రెచ్చి పోవుచునున్న పిచ్చి క్రిమిని
ద్రష్టలు గుర్తించి దారికి తెచ్చినన్
మనుషుల మనుగడ మరల సాగు
భరతభూమిని గల భాగవతోత్తముల్
దృష్టి సారించుడీ దిగులు మాన్ప
ధరణి ధన్వంతరి చరక సుశ్రుతులను
తపము చాలింపను తట్టవలెను
తే.గీ. వెండికొండను శీఘ్రమే వీడజేసి
తరల జేయుము రక్షింప తక్షణముగ
క్రూరమైనట్టి చనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 17. మాతృభూమి విశిష్టత

సీ. మమతాను రాగాల మాతృభూమిని వీడి
గబ్బు డబ్బును కోరి గంతులిడిరి
పరదేశములకేగి సురలోకమని మెచ్చి
గల్లలనెగిరేసి గర్వపడిరి
రోగాల కుంపటి రుధిరమౌ జ్వాలలు
చెలరేగుచుండగా చింతతోడ
అక్కున చేర్చు నీ యమ్మ భారతి యొడిన్
శీఘ్రమే యీనాడు చేరుకొనిరి

తే.గీ. తనదు సంతానమెల్లరన్ దరికి చేర్చి
యెల్ల వేళల కాపాడు తల్లి మనది
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 18. రెండవరోజు స్వీయనిర్బంధము

సీ. ఆరంభశూరులై యవివేకులొకరోజు
పాటించిరాజ్ఞలన్ పట్టుదలను
చిట్టచివరిదాక పట్టును వీడక
సహకరించుడనుచు చాటుచుండ
పట్టణ వీధులన్ వాహనాల్ నడిపిరి
సూచనలొసుగులన్ చూపిరంత
పిచ్చినా వెధవలు కచ్చిత నియమాలు
పాటింపకను క్రిమి పరుగు లిడెను

తే.గీ. రక్షకభటులు చర్యలు రయముతోడ
నమలుచేయుట కొరకు నే డడుగులిడిరి
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 19. మరణమృదంగమై మ్రోగుట

సీ. అగ్ర రాజ్యము పైన నాధిపత్యానికై
చై నాధినేతలు సాహసించి
దృష్టి నిల్పిరి క్రిమి సృష్టింపబడజేసి
బలిగొని తమదేశ ప్రాణములను
రాకాసిరూపాన రక్తము గ్రోలను
గగనమార్గముగుండ కదలుమనిరి
సూక్ష్మరూపముదాల్చి చోద్యము గాభువి
యంతట వ్యాపించె చింతలేక

తే.గీ. మసలె మరణమృదంగమై మారుమ్రోగె
విలయతాండవమై పురి విప్పి యాడె
క్రూరమైనట్టి చైనాకరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీ నృసింహదేవ!

### 20. వ్యాధి లక్షణాలు

సీ. ముక్కు పుటాలలో చిక్కని ద్రవముతో
పడిసెము వెంటాడి విడువకుండ
వ్యాధి సంక్రమణమై వ్యధలకు గురిచేసి
గాలి పీల్చుట కూడ గగనమగును
దగ్గిన తుమ్మిన దరినున్న వారలన్
కబళించి శీఘ్రమే కాటికంపు
తగిన జాగ్రత్తలు తప్పక పాటించి
రక్షణ పొందుడు తత్క్షణముగ

తే.గీ. స్వీయనిర్బంధమెప్పుడు క్షేమమొసగు
ఆచరింపను చాటుమా! యందరకును
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**21. ఆంక్షలను ఆమలుచేయుటలో అధికారుల ఇబ్బందులు**

సీ. దొంగచాటున కల్లు దుకణాలు బారులు
తెరచి యమ్ముచు నుండ విరివిగాను
జిహ్వాచాపల్యమై చేటెరుంగక నేడు
పిచ్చినావెధవలు పుచ్చుకొనిరి
ఆంక్షలన్ విడనాడి రాతృతతోడను
సొమ్ముచేసుకొనిరి శుంఠలగుచు
వ్యాధితీవ్రతనిట వ్యాపింప నరికట్ట
సహకార మొసగరు చవటలెల్ల

తే.గీ. ప్రజల సంరక్షణార్థమై నిజముగానె
ఏల కట్టడి చేయుదు రేలిక లిక
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**22. కళ తప్పిన శార్వరీనామ వత్సరము**

సీ. శార్వరీనామమా! సంతోషముగ నేడు
వందనాలర్పింప వశముకాదు
వ్యాధిభూతము నేడు వసుధను వెంటాడి
కునుకు లేకుండగా కుములజేసె
షడ్రుచుల్ పచ్చడిన్ సమకూర్చగను లేము
పంచాంగ శ్రవణమై పరుగలేము
కోకిలగానాలు కొసరి కోరగలేము
కవుల సమ్మేళనాల్ కానలేము

తే.గీ. దుఃఖ సంద్రాన మమ్ముల దూకజేసె
అండదండగ నెవరున్నరమ్మ! మాకు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

## 23. విశ్వనాథునకు విన్నపం

సీ. ప్రకృతి ప్రకోపించి ప్రాణాలు కబళించె
కారణ మేమిటో కానరాదు
దైవనిర్ణయమేమొ దనుజుల సృష్టియో
తెలియరాకున్నది తేటముగను
ఎల్లఖండంబులు నల్లకల్లోలమై
వ్యాధితీవ్రత కాంచి వణికిపోయె
దేశమున్ వీడి విదేశాల కరిగిన
కన్నపేగుల జూడ కలత పడిరి

తే.గీ. విశ్వనాథుడీ లోకమున్ వీడెనేమొ
ధరణిపై నేటి వింతల నెరుగడేమొ
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

## 24. దైవమే శరణ్యం

సీ. హరినామ కీర్తనల్ మరచిరీ లోకులు
హేతువాదముతోడ హీనముగను
భక్తిని విడనాడి భుక్తికై నిత్యము
ద్రవ్యము కూర్చిరి దండిగాను
గర్వాంధకారులై దుర్వీశుడేడని
ఖండించిరీనాటి కర్మ మేమొ
కడుపక్వమై పండు తొడిమె నూడినరీతి
కాలమే తెరిపించు కనులనపుడు

తే.గీ. అవని పాపకర్ములు పండు టాకులవలె
రాలిపోవుట నెరుగరీ జోలి వినరు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 25. కలినమైన ఆంక్షలమధ్య స్వీయనిర్బంధము

సీ. శృంఖలాలుగ క్రిమి చెలరేగుచున్నది
అడ్డునదుపులేక యవనిపైన
కఠినమౌ నిర్ణయాల్ గైకొని శీఘ్రమే
అదుపు చేయగ నెంచి రాజ్ఞ లిడిరి
ముందు జాగ్రత్తగా విందు వినోదాలు
సంబరాలన్నియు చాలుననిరి
చంటిపిల్లలతోడ నింటిని వీడక
స్వీయనిర్బంధమున్ చేయుడనిరి

తే.గీ. వ్యాధి నరికట్టి శీఘ్రమే వసుధపైన
ప్రజల ప్రాణాలు కాపాడ పాటుబడిరి
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 26. ముక్కోటి దేవుళ్ళను ప్రశ్నించుట

సీ. లెక్కకు మించిన ముక్కోటి దేవతల్
కొలువైరి ధరణిపై కొరతలేక
భక్తులెల్లరు తమ శక్త్యనుసారము
పాదార్చనలు చేసి ప్రణతులిడిరి
కళ్యాణములు జేసి కట్నాలు కాన్కలన్
ముట్టజెప్పిరి కద మోద మలర
సకలార్థములుకోరి సంతృప్తి నొందించి
అండదండగనుండ దండ మిడిరి

తే. ఏల కాపాడ రారు? మీరెచట గలరు?
ప్రాణరహితమై వెలసిన ప్రతిమలేన?
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**27. నారద మహర్షికి విజ్ఞప్తి**

సీ. ముల్లోక పూజిత! మునిజన వందిత!
త్రైలోక సంచారి దండమయ్య!
శ్రీలక్ష్మి విభునకు శీఘ్రమే యందింప
నీలోక బాధల నెరుగ లేవ?
అలసిన సొలసిన సెలవు గైకొన్నను
అత్యవసరమిట కడుగులిడుము
పెనుభూతమై వ్యాధి పీడించె లోకమున్
దిక్పాలకులుకూడ దిగులు బడిరి

తే.గీ. నారదా! మునిపుంగవా! నతులు నీకు
విశ్వనాథుని కెరిగింప వేగ రావ!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**28. ఉగ్ర నరసింహ స్వామిని వేడుకొనుట**

సీ. ప్రహ్లాద వరదుడా! ప్రవిమల చరితుడా !
భక్తమందారుడా! భానుతేజ !
క్రిమి సూక్ష్మరూపాన క్రమముగా చెలరేగి
రక్తపిపాసియై రాక్షసముగ
నెల్లరన్ భువిపైన కల్లోల పరచెను
ప్రాణాలు కబళించి పరుగులిడెను
నీభక్తు లెల్లరన్ నిర్దయన్ వెంటాడి
బాధించుచున్నది భయము లేక

తే.గీ. దేవ! పాహిమామ్ పాహిమామ్ దిగులు మాన్పి
మమ్ము రక్షింప రావయ్య మరల భువికి
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### ౨౯. జగన్మాతలను ప్రార్థించుట

సీ. దోసిలొగ్గితి మమ్మ! త్రుంచుడీ వ్యాధిని
సురలు త్రిమూర్తుల సుదతులార!
శక్తిస్వరూపులు! ముక్తిప్రదాతలు!
ఆదిదేవతలార! యమ్మలార!
అవనిపై మరువక నవదుర్గరూపాలు
కోరి సేవింతుము కోర్కె మీర
అండదండగనుండి యక్కున చేర్చి మ
మ్మాదరించగ చూడు డభవులార!

తే.గీ. సృష్టిలోపల చెలరేగు దుష్టమణచి
బిడ్డలను బ్రోవ తల్లుల కడ్డమేది?
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### ౩౦. సర్వమత ప్రార్థనలు

సీ. ఘనమైన పూజలు గంధాలు ప్రార్థనల్
సాగుచున్నవి భువిన్ శాశ్వతముగ
మతములు సూచించు మార్గాలు వేరైన
చాటిచెప్పిన మేటి సత్యమొకటె
పరమాత్మ రూపాలు పాషాణ హృదయులన్
కోర్కె మీరగనిల కొలుచువేళ
సద్భక్తితో ముందు సాష్టాంగ బడినను
దర్శన మొసగరు దయను రాదు

తే.గీ. రాముని రహీము యేసులన్ రాత్రి పగలు
స్మరణ జేసినన్ వ్యాధిని చంపరారు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 31. రక్త పిపాసి

సీ. సూక్ష్మాతిసూక్ష్మమై జోరుగా వ్యాపించె
విశ్వమంతట నిండె వింత జీవి
రక్తపిపాసియై శక్తి రూపము దాల్చి
కర్కశ హృదయాన కోర్కె మీర
ప్రజలను వెంటాడి ప్రాణాలు కబళించె
దాహము తీరక తరలుచుండె
వైరిని బంధింప వైద్యనారాయణుల్
కరవాలములు బూని కదలిరంత

తే.గీ. ప్రజలకై తమ ప్రాణాలు పణముగాను
నిలిపి పోరాడు చున్నారు నీరజాక్ష!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 32. విచ్చలవిడి తనము

సీ. వేలాది ప్రాణాలు నేలకూలగ జేసె
భయకంపితుల జేసి పట్టువిడక
జడలు విప్పారగా వడివడిన్ పయనించి
నేలను గుప్పిట నిలుపు కొనెను
సకలజనులనెల్ల సంకటంబులయందు
ముంచెత్తు చున్నది మూర్ఖముగను
మోహాంధకారాన దేహాల చొరబడి
అవయవాలన్నిట నాతృతముగ

తే.గీ. దాడిచేయుచు రక్తము ద్రావి తుదకు
వల్లకాడుగ మార్చెను వసుధనిపుడ
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 33. గరుత్మంతునికి విజ్ఞప్తి

సీ. శరణువేడితినయ్య సౌవర్ణ! భక్తులన్
రక్షింప రావయ్య! తత్క్షణముగ
అల్లకల్లోలమై యట్టుడ్కె లోకము
వింతగా క్రిమి సోకె వేగముగను
వ్యాధి నిర్మూలించు వైద్యము దొరుకక
విగతజీవులునైరి విశ్వ మందు
ఒక్కసారిగ నీదు రెక్కలన్ విదిలించి
ధరణిపై వ్యాధిని తరుమలేవ!?

తే.గీ. సకల జలనిధులెగజిమ్మ వికలపరచు
ధీర ఖగరూపుడా! వైనతేయ! రమ్ము
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 34. స్వీయ నిర్బంధమును సఫలము చేయుట

సీ. చావు రేవుల మధ్య సమరమందున జనుల్
అలుపెరుగక పోరు సలుపవలెను
విజయమొందు వరకు వెనుకంజ వేయక
ధరణిపై క్రిమికిటు కెరుగవలెను
గృహములన్ వీడక విహితమౌ పద్ధతిన్
సద్బుద్ధితోడను సాగవలెను
రుసరుసలాడు కరోనను బంధించి
కూకటి వ్రేళ్ళతో కూల్చవలెను

తే.గీ. స్వీయనిర్బంధముననుండి చివరివరకు
సహకరించిన సమరము సఫలమగును
క్రూరమైనట్టి చైనా కరోననణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 35. ఆశా, అంగన్ వాడి, మున్సిపాలిటీ సిబ్బంది సేవలు

సీ. ఆశ యంగన్ వాడి యమ్మలక్కలుకూడ
బాధ్యతతోనన్ని ప్రాంతములను
పరిసరాలంతట పరిశుభ్రతను గూర్చి
యెరిగించి రింటింట నెల్లరకును
పౌష్టికాహారమున్ ఫలముల నన్నింటి
నారగింపను చాటిరందరకును
విశ్రాంతి విడనాడి విద్యుక్త ధర్మమున్
పాటించి రత్యంత పట్టుదలను
తే.గీ. ప్రాణ సంకటమై వ్యాధి ప్రభలుచుండ
ప్రజల సంరక్షణార్థమై పరుగులిడిరి
క్రూరమైనట్టిదైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 36. రక్షక భటుల సేవలు

సీ. స్వీయ నిర్బంధమున్ చేయనోపని వెర్రి
వెధవలూరూరను వీధులందు
కష్టాల నెరుగలేకిష్టానుసారము
కబురు లాడగనెంచి కదలు చుండ
కఠినమౌ నాంక్షలన్ కట్టడి చేసిరి
రక్షకభటపాళి రాత్రి పగలు
బెత్తము చురకలన్ పిరుదులకంటించి
హద్దునుండగ జేసి రబ్బురముగ
తే.గీ. వైరిగానెంచి రెల్లరు వ్యాధినిపుడు
నిర్వహించిరి విధులను నేర్పుతోడ
క్రూరమైనట్టి దైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

## 37. ప్రజల ఆర్థిక మద్దతు

సీ. వ్యాధి విజృంభించి వైరిగా నంతట
చెలరేగుచుండగా శీఘ్రముగను
యుద్ధమున్ చేయ సంసిద్ధమయ్యెను మోది
విజయమున్ సాధింప విశ్వసించె
ప్రజల మద్దతు కోరి ప్రకటించె నార్థిక
సహకారవంతుల స్వాగతించె
బాధ్యత నెరిగిన పౌరులెల్లరు మెచ్చి
కోట్లు, లక్షలు, వేలు గ్రుమ్మరించి

తే.గీ. శక్తి కొలదిగా నెల్లరు సంతసమున
జాగు చేయక తమ భక్తి చాటుకొనిరి
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

## 38. విద్యా వాలంటీర్ల చేయూత

సీ. విద్యాలయాలలో నుద్యోగులునుకాని
స్వచ్ఛందబోధకుల్ సంతసమున
గౌరవ భృతినొంది కాలాభ్ర వీధిలో
నెదురైన దుస్థితి నెదురుకొనగ
దినసరి వేతనాల్ దీక్షతో సమకూర్చి
అందజేయుచును సహాయనిధికి
ఎందరికో స్ఫూర్తి నందించి నిలిచిరి
దిగులు మాన్పిరి నేడు దేశమునకు

తే.గీ. సేతు నిర్మాణ మగుచుండ చిత్తగించి
వడిగ నిసుకదెచ్చిన మేటి యుడుతలైరి
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 39. పిచ్చెక్కిన మందు బానిసలు

సీ. మందు విందుల రుచి మరిగిన బానిసల్
మాధవున్ స్మరణను మరచినారు
చింతలన్ కలిగించు వింతజీవి నిపుడు
మట్టు బెట్టగ నెంచి పట్టువిడక
ప్రజలెల్లరును సురాపాన కేంద్రాలను
మూయింప జేసిరి మొదటగాను
కల్లు కానక కొంద రిల్లువాకిటియందు
పిచ్చెచేష్టలతోడ రెచ్చిపోయి

తే.గీ. గాలి దయ్యాలు సోకగా గంతులిడెడి
వారలను పోలుచున్నారు వీరలిపుడు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 40. స్వచ్ఛంద సంస్థల ఆపన్న హస్తాలు

సీ. ఆపన్నహస్తాల నందించి మేల్గూర్చ
స్వచ్ఛందసంస్థలు సహకరించె
సహృదయులగు పరిశ్రమలను నడిపించు
కోటీశ్వరులు కూడ కోర్కెమీర
ముడుపు రసీదులన్ ముట్టజెప్పుచు తమ
అండదండను చాటి రాదరించి
చిన్న చితక కొల్వు చేయువారలునెల్ల
ధనమునందించిరి దండిగాను

తే.గీ. సకల జనులెల్లరైక్యతన్ చాటి చెప్పి
అంత మొందింప బూనిరి వింత క్రిమిని
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 41. శ్రీశైల వాసునికి విన్నపాలు

సీ. కైలాసవాస! మా కష్టాల నెరుగవా
దయతోడ మమ్మేల దరికి రావ!
ప్రాణాలు కబళింప బహుసూక్ష్మజీవొకటి
కాలనాగుగ మారి కాటువేసె
మందుమాకులు లేక యెందరో కాటికి
బలియగుచున్నారు పార్వతీశ!
నల్లమల వనమున్ మెల్లగా విడనాడి
కాపాడ శీఘ్రమే కదలిరావ!

తే.గీ. విషము విరజిమ్మి గాలిలో వింతజీవి
కనుల కగుపడకుండగా కలచి వేసె
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 42. గోకులనందనునికి విన్నపము

సీ. గోకులనందనా! గోవర్ధనోద్ధార!
కాళీయ మర్ధన! కంసవైరి!
లోకమున్ పీడించు రాకాసి రూపమున్
సంహరించుట మాకు సాధ్యమగున?
బుడిబుడి నడతల నడుగిడి తడయక
గడుసరి చెడుగుపై గంతులిడుము
భక్తులన్ రక్షింప పాంచజన్యమునూది
వినిపింప జేయుము విశ్వమంత

తే.గీ. బుజ్జి కన్నయ్య మమ్మేల పుడమిపైకి
వెన్న ముద్దలందించెద వేగరమ్ము
క్రూరమైనట్టి చనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**43. ఢిల్లీలో మతఛాందస వాదుల వెర్రి చేష్టలు**

సీ. ప్రాణాంతకవ్యాధి ప్రజలను వెంటాడి
పీడించుచుండగా పెచ్చరిల్లి
దుర్మార్గులాంక్షలన్ త్రోసిరాజని తమ
మతమౌఢ్యమును చాట మసలుకొనిరి
తిప్రినా వెధవలు దేశమెల్లలనుండి
కార్యకర్తలనెల్ల కదలుడనిరి
అత్యంత క్రూరులు హస్తినా పురమున
నేరుగా నైజాము నిలయమునకు!

తే.గీ. చేర్చి సభ నిర్వహింపగా చెడుగు సోకి
క్రమముగా దేశ మంతట క్రమ్ము కొనెను
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**44. వీధుల వెంబడి జులాయిలు**

సీ. క్లిష్ట పరిస్థితిన్ కేల్మోడ్చిననుగాని
వినిపించు కొనలేదు వెధవలిపుడు
చెవినిల్లు కట్టుక చెప్పి చూచిన గాని
మొట్టెను వీడని మూర్ఖు లిపుడు
పాదాలచెంతను ప్రణమిల్లి నుడివిన
శుభము నెరుగనట్టి శుంఠలిపుడు
కల్పితాలెన్నియో కారణాల్ చూపించి
వీధులన్ తిరిగిరి వెర్రిగాను

తే.గీ. వ్యాధినంటించి రింటింట వరుసగాను
పంపు చున్నారు యమపురి కొంపలార్చి
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**45. వైద్యులపై దాడిని ఖండిస్తూ**

సీ. మతఛాందసముతోడ మారణహోమాలు
సృష్టించు చున్నారు సిగ్గులేక
కఠినమౌ నాంక్షలన్ గాలికి వదిలేసి
మూర్ఖులై సభకేగి మూగినారు
వ్యాధినూరికితెచ్చి వల్లకాడుగ మార్చ
నింటిల్లిపాదికి నంటచేసి
కాటికంపుచునుండ కరుణార్ద్ర హృదయులు
ప్రత్యక్ష దైవాలపైన నేడు

తే.గీ. కుట్రతో దాడి చేయుచు క్రూరులార!
మూలమూలల దేశమున్ ముంచినారు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**46. శ్రీరామచంద్రునకు విజ్ఞప్తి**

సీ. ధర్మస్వరూపుడా! ధశరథాత్మజ! దేవ!
రఘువంశ తిలకుడా! రామచంద్ర!
ప్రాకటంబుగ నీదు పట్టాభిషేకమున్
కనులార వీక్షింప కదలలేము
సాకేతపురవాస! లోకమందీనాడు
వింతలనెరుగవా? విమలచరిత!
వసుధపై భక్తుల ప్రాణాలు కబళింప
వెంటాడు చున్నది వింత జీవి

తే.గీ. మట్టు బెట్టగ మానవ మాత్రులకిట
తరము కాకున్నది భువికి తరలిరావ!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 47. పాపము పండిపోవుట

సీ. భువిపైన వెలసినా రవధూత లెందరో
ధర్మమార్గము చూపి తరలుడనిరి
ముక్తినందించెడి భక్తిమార్గము చూపి
విశ్వాసమును నింపి వీడకనిరి
సృష్టిలో నెలకొన్న జీవులన్నిటిపైన
సద్భావమును కల్గి సాగుమనిరి
సత్యనిష్ఠుల కాంచి మృత్యుదేవతకూడ
కబళింపకుండగ కదలుననిరి
తే.గీ. పాపపంకిలమధికమై యోపలేక
ఉద్భవించెనేమో క్రిమి యుసురుదీయ
క్రూరమైనట్టి చైనా కరోననణచ
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 48. కరోనాకు హెచ్చరిక

సీ. శాంతించు మికనైన చైనా పిశాచమా!
దుశ్చేష్ట లాపుము తొలగిపొమ్ము
ఇటువచ్చినా వెందు కెచ్చటి దానవే?
కడతేరుట నిజము కచ్చితముగ
భక్తితో విలసిల్లు భారత భూమిని
హద్దు మీరగ నేల బుద్ధి తగదు
ఆగ్రహోదగ్రుడై యుగ్ర నరసింహుడే
ఉద్భవించిన నేల నుండతగదు
తే.గీ. కోరలను పీకి శీఘ్రమే కూల దన్ని
మట్టుబెట్టును మామంచి మాట వినుము
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదే!

### 49. ధర్మో రక్షతి రక్షితః

సీ. అష్టదిక్కులయందు సృష్టిలో నెలకొన్న
జంతుజాలము పక్షి సంఘమునకు
రక్షణేమున్నది భక్షింపదీక్రిమి
మనుషులన్ వెంటాడె మర్మమేమొ?
కుట్ర కుతంత్రాల కుళ్ళు బోతులు నేడు
వెలుగొందుచున్నారు విశ్వమంత
ధర్మవిహీనులన్ కర్మానుసారమై
యణచడానికి భువి నవతరించి

తే.గీ. కరుణనిసుమంత లేకుండ కలచి వేసి
కాలుని కడకు పంపించ కదలెనేమొ?
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 50. ఆత్మనివేదనం

సీ. పాపిష్టిదీ క్రిమిన్ పాతిపెట్టగ మార్గ
మెరుగలేకుంటిమీ యిలను నేడు
వైద్యోపకరణాల వల్ల కాకున్నది
యునికి గుర్తింపక నోడెనిపుడు
బీభత్సమును గొల్పి పెనుసవాలుగ మారె
నంతుచిక్కగలేక యడలజేసె
విశ్వప్రయత్నాలు విఫలమై పోయిన
వదుపును చేయువా డభవుడనిరి

తే.గీ. లోక కంటకాలను త్రుంచి ప్రాకటముగ
తత్క్షణంబుగ రక్షించు దక్షులెవరు?!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**51. దశావతారాలు (మత్స్యావతారము)**

సీ. ప్రళయకాలమునందు పరమభక్తుండైన
సత్యవ్రతుని జన్మ సఫలమాయె
సోమకుండు శ్రుతుల చోరుడై దాగగా
మత్స్యావతారాన మట్టుబెట్టి
నేర్పుగా నిగమాలు నీరజ భవునకు
శీఘ్రమే చేర్చిన చిద్విలాస!
ధరణిపై కొనసాగు దశదిక్కులాపదల్
త్రుంచివేయగలేద తోయజాక్ష!

తే.గీ. ప్రాణ సంకట మీక్రిమి బారినుండి
నేడు రక్షించు భారము నీదె కాద!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**52. దశావతారాలు (కూర్మావతారము)**

సీ. అమరత్వమును కోరి రమృతమునాశించి
రంబుధిన్ చేరినారాతురతను
మంథరన్ సంద్రాన మథియింప బూనిరి
గట్టిగా వాసుకిన్ చుట్టిరపుడు
చిల్కుచుండ నగము స్థిరముగా నిలువక
జలజల క్రిందికి జారుచుండె
క్రుంగనీయకపుడు కూర్మావతారమై
యద్రినాపితివి నీవద్భుతముగ

తే.గీ. పాలసంద్రాన క్రమముగా భాండమొకటి
నుబుక జేసితి వట పురుషోత్తమ! యిల
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**53. దశావతారాలు (వరాహావతారము)**

సీ. ప్రళయ కాలము నందు ప్రాణి కోటికి జీవ
నాధారమైనట్టి యవని చెదరి
నీట మునిగి పోయి నిలిచె పాతాళాన
వింతయని విధాత చింత నొందె
అభవుడా! శ్రీహరీ! యాది వరాహమై
నేర్పుగా ముట్టెపై నిలిపినావు
రాక్షసుడైన హిరణ్యాక్షు డెదిరింప
చక్రాయుధముతోడ చంపి నావు

తే.గీ. అక్రమాధ్వము నొందిన నసుర జాతి
నంత మొందించితివి కదా పంతముగను
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**54. దశావతారాలు (నరసింహావతారము)**

సీ. అసురేంద్రు ననుజన్ము నంతమొందింపగా
కత్తిదూసె హిరణ్యకశిపుడంత
పద్మసంభవునికై ప్రార్థించె ననితర
సాధ్యమౌ వరముల సంతరించె
హరిభక్తుడైన ప్రహ్లాదునితో మన
శత్రువు స్మరణేల? పుత్రకుండ!
ఆపుమా హరినామ మంతుచూచెద వాడు
సర్వోపగతుడౌన? చంపుదునని

తే.గీ. స్తంభమును బాదె నందుండి తత్క్షణముగ
ఉగ్రనరసింహమై పైకి నురుకలేద!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**55. దశావతారాలు (వామనావతారము)**

సీ. బలగర్వితుండైన వైరోచను డమర
విభునిసింహాసమున్ వీడ జేసె
స్వర్గసీమను చేరి సకలదేవతలను
గడగడలాడించి గంతులేసె
సకలభోగాలతో సాగువారలు సృష్టి
తనకు సాటెవరని తలచుచుండె
విశ్వవిజేతగా విర్రవీగుచు నొక
క్రతువున ద్విజులకు ద్రవ్యమొసగె

తే.గీ. వడుగువై మూడడుగులను వరమునంది
బలిని త్రొక్కి పాతాళాన పాతలేద!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**56. దశావతారాలు (పరశురామావతారము)**

సీ. క్ష్మాతలమందున క్షత్రియులెందరో
ధర్మవిహీనులై తరలిరంట
కార్త్యవీరార్జునిన్ క్షంతవ్యములుకాని
కార్యకలాపాలు కాంచితివట
దనుజులాకృతులను దండింపగానెంచి
యవతరించిన శ్రీ హరివికాదె !
పరశువున్ చేబూని ధరణినెల్లలదాక
వెంటాడి చంపిన విష్ణురూప!

తే.గీ. అవని పైన నకృత్యాల నదుపుచేసి
భక్తులను కాచితివి కదా పరశురామ!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**57. దశావతారాలు (రామావతారము)**

సీ. పరమేశ్వరా! సాధు భక్త సంరక్షకై
పుడమినయోధ్యలో పుట్టినావు
జనకుని మాటను జవదాటకుండగ
కాననములనుండ కదలినావు
రక్తము గ్రోలెడి రాక్షసులను త్రుంచి
మునులకెల్లను క్షేమ మొసగినావు
ధర్మము దప్పిన దనుజ రాజేంద్రునిన్
గుణము కాదని నేల కూల్చినావు
తే.గీ. నేలపై రామరాజ్యము నిలిపినావు
సకల భువనాలు కీర్తింప సాగినావు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**58. దశావతారాలు (బలరామ అవతారము)**

సీ. అన్నదమ్ముల బంధ మనురాగములు చాట
నవతరించితివయ్య! యాదిశేష!
ద్వారకానగరాన ధన్యులు రోహిణీ
వసుదేవపుత్రుడ! వందనములు
బాల్యమందున నిన్ను బలవంతముగ చంప
పూనగా నసురుని పూడ్చినావు
సంకర్షణానామ! సత్వసంపన్న! మీ
చరణారవిందాలె శరణు మాకు
తే.గీ. అవనిని యధర్మ మెరుగని హలము నీదు
హస్తమందున వెలుగొందె నాయుధముగ!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**59. దశావతారాలు (కృష్ణావతారము)**

సీ. వసుధపై పేర్కొన్న పాపపంకిలమును
కడిగివేయగనెంచి కదలినావు
అసురజాతిని పట్టి యంతమొందించియు
కుట్రల్ కుతంత్రాల కూల్చినావు
నందాత్మజా! జగన్నాటకసూత్రుడా!
విభ్రమాల్ చూపిన విశ్వ గురుడ!
ధర్మరక్షణకయి కర్మసిద్ధాంతమున్
వినిపించి చాటిన విష్ణురూప!

తే.గీ. పద్మనాభ! ఓ గోవింద! భక్త వరద!
సృష్టి నేలుచునున్న శ్రీకృష్ణ రూప!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**60. దశావతారాలు (కల్క్యవతారము)**

సీ. అవనిపైన నధర్మ మవినీతు లాగడా
లధికమైపోయిన వరయు మయ్య!
అరిషట్క మంతట నావరించెను దేవ!
ముదములేదిచట దామోదరుండ!
ఆధిపత్యము కోరు నవివేకి చేతిలో
జీవాయుధమ్ముల సృష్టి జరిగె
దండిగా రోగాలు దాపురించెను జీవు
లాయుప్రమాణము లడుగునంటె

తే.గీ. అల్లకల్లోలమైపోయిరెల్ల జనులు
రమ్ము కల్క్యావతారాన రయముగాను
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 61. నవవిధ భక్తులు (శ్రవణం)

సీ. సత్సంఘమును కోరి సప్తాహములయందు
పాల్గొనుచుంటిని పరమరూప!
నిక్కమౌ నీకథల్ నెమ్మదితోడను
చెవులార వింటిని చిద్విలాస!
మకరందమును గ్రోలి మదిని నిక్షిప్తమై
నెమరువేయుచునుంటి నిగమరూప!
విభ్రమంబులెరిగి వింతగా నాతన్వు
పులకించి పోయెను పుణ్య పురుష!
తే.గీ. అంతు చిక్కక నున్న వనంతరూప !
తనివి తీరక నిత్యము మననమాయె
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 62. నవవిధ భక్తులు (కీర్తనం)

సీ. ఆత్మస్వరూపుడా! ఆనందనిలయుడా!
పుండరీకాక్షుడా! పుణ్యపురుష!
నారాయణా! హరి! నారాయణా! కృష్ణ !
గోవర్ధనోద్ధార ! గోపితాప్త!
కాళీయమర్ధన! కామస్వరూపుడా!
కంజాక్ష! శ్రీపతీ! గరుడగమన!
నీరదశ్యాముడా! నిరుపమ తేజమా!
రాక్షసవైరి! నిరంజనుండ!
తే.గీ. ఆర్తులెల్లరన్ రక్షించు కీర్తిసాంద్ర!
భక్త సులభుడా! నీనామ భజనపరుడ
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**63. నవవిధ భక్తులు (స్మరణం)**

సీ. శ్రీపరాత్పర! హరీ! శ్రీకరా! శుభకరా!
నిత్యాయ! సత్యాయ! నిగమరూప!
క్షీరసాగరవాస! శ్రీధరా! పరమేశ !
ముచుకుందవరద! దామోదరుండ!
వేదసంరక్షక! విశ్వాత్మకా! ప్రభు!
భక్తమందారుడా! భానుతేజ!
వైకుంఠ పురవాస! పద్మావతీప్రియ!
సర్వలోకారాధ్య! సారసాక్ష!
తే.గీ. వరద! దేవ! పరంధామ! పద్మనాభ!
శౌరి! నీలమేఘశ్యామ! నీరజాక్ష!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**64. నవవిధ భక్తులు (పాదసేవనం)**

సీ. దేవాదిదేవుడా! దివ్యస్వరూపుడా!
నీపాద సేవకై నిలిచినాము
విశ్వమున్ వీక్షింప విహరించి యలసిన
పరిచర్యలుండును తరలిరమ్ము
మలినవస్త్రాలను తళతళలాడించి
చల్వచేయుదుమయ్య సాగిరమ్ము
ఆకలిగానున్న నన్న ప్రసాదాలు
స్వీకరింప నిటకు చేరుకొనుము
తే.గీ. దివ్యమంగళ రూపమా! దృష్టి నిలిపి
భవ్యగుణసాంద్ర! మమ్మేలు భానుతేజ!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 65. నవవిధ భక్తులు (అర్చనం)

సీ. శ్రీధరా! మీపాద శ్రీకమలాలను
విశ్వసించితిమయ్య! వేదవేద్య!
పంచామృతము దెచ్చి భక్తిప్రపత్తితో
నభిషేకమొనరింతు మందుకొనుము
సంతోషముగ మీదు చరణారవిందాల
పుష్పాక్షతలతోడ పూజ సల్పి
నారికేళాలును నైవేద్యముంచితి
మరుదెంచి తృప్తిగా నారగించు
తే.గీ. భక్తుడైన సుధాముడు ముక్తినొందె
సరిగ నాతీరుగను మాకు వరమునిమ్ము
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 66. నవవిధ భక్తులు (వందనం)

సీ. అచ్యుతా! గోవింద! అమరేంద్ర పూజితా!
వందనాల్ గొనుమయ్య వారిజాక్ష!
గాఢాంధకారమౌ కాలప్రవాహాన
దిక్కూచి నీవయ్య! దేవదేవ!
భక్తులన్ రక్షించి ముక్తినందించు మీ
పాదపద్మాలకు ప్రణతులయ్య!
హృదయారవిందము తృప్తిగా నర్పించి
సాష్టాంగ బడితి ప్రశాంతరూప!
తే.గీ. ఆది మధ్యాంత రహిత! మా యంతరంగ!
స్వీకరింపుము మా నుతుల్ విశ్వ వినుత!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**67. నవవిధ భక్తులు (దాస్యం)**

సీ. దేవాదిదేవ! నీ దివ్యసందేశాలు
చాటింపు చేయించి సాగుచుందు
ప్రజల మనమ్ముల భక్తిబీజము నాటి
నిర్విరామకృషిని నెరపుచుందు
విశ్వాత్మకా! నీదు విమలమౌ చరితను
పూని కీర్తనలల్లి పొగడుచుందు
సర్వేశ్వరా! భక్తి సత్సంఘములు నిల్పి
శాశ్వతంబుగ చర్చ జరుపుచుందు

తే.గీ. దాసపోషకా! నీ దాసదాసులకును
దాసునిగ మెలగుచునుంటి ధర్మతేజ!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**68. నవవిధ భక్తులు(సఖ్యం)**

సీ. నిశ్చలాత్ముడనౌచు నిష్కామ కర్మతో
చెలిమినాశించితి చిద్విలాస!
ముద్దు ముచ్చటలాడి ముసిముసి నవ్వుతో
సత్కథల్ చెప్పుము సారసాక్ష!
సతతము జతనుండి సరదాగ విహరించి
సంతోషమును పంచు సకలరూప!
హృదయారవిందాలు ముదముతో మీ పాద
పద్మాలకర్పింతు పరమపురుష !

తే.గీ. నిర్గుణసగుణోపాసకుల్ నీదు మహిమ
చాటి చెప్పగా వింటిని సత్యలోక!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**౬౯. నవవిధ భక్తులు (ఆత్మనివేదనం)**

సీ. పతితపావన నామ! పామర జనలోల!
వినలేవ నామొర? విశ్వనాథ!
నరహరీ! శ్రీనాథ! పరమ దయాకర!
దీనరక్షక! రార మౌనమేల?
ముల్లోకములనేలు ముగ్ధమనోహర!
దేవ! త్రివిక్రమ! ధీరపురుష!
అన్యులనెరుగ నే నాపన్నహస్తమా!
దరిచేర్చరావయ్య! దానవారి!

తే.గీ. సూక్ష్మజీవి సంసిద్ధమై చోద్యముగను
అల్ల కల్లోలపరచె నేడవనిపైన
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**౭౦. ఆత్మాహుతి దాడులేమో.....!!**

సీ. మర్కజ ప్రాంతాన కర్కష హృదయులై
కుట్రపూరితముగ కూడిరేమొ?
వ్యాధికారకమును వ్యాపింపగానెంచి
వెంటదెచ్చి ప్రజలకంటిరేమొ?
భరత వర్షమునందు ప్రాణాలు బలిగొని
మతఛాందసముతోడ మసలిరేమొ?
ఆత్మాహుతులదాడి కవతారమెత్తిరో?
అజ్ఞాతముననుండి రసురులిపుడు

తే.గీ. దేశసౌభాగ్యమును కోరు ధీరులార !
నిదుర వీడుడు మూర్ఖుల నిగ్గు దేల్చ
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**౭1. దేశమంతట దీపాలు, కాగడాలు**

సీ. భక్తితత్పరులైన భారతీయులు మోది
పిలుపునందుకొనిరి ప్రేమమీర
అసురజాతి క్రిమి నంతము చేయుట
కైకమత్యము చాటి రడుగులిడిరి
పిన్నలు పెద్దలు ప్రీతితో జ్యోతులన్
వెలిగించి రింటింట వేడ్కతోడ
కాగడాలను బూని రేగి మేడలపైన
నినదింప జేజేలు నింగినంటె

తే.గీ. విలసితంబుగ దేశము పులకరించె
ప్రస్తుతించిరి పరదేశ పాలకులును
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**౭2. కలియుగ దైవము శ్రీవేంకటేశ్వరునికి విన్నపాలు**

సీ. యుగపురుష! దయతో యోగనిద్రను వీడి
సృష్టిని పరికించు దృష్టి నిలిపి
అవనిపైన నభాగ్యు లన్యాయముగ నేడు
బలియైరి చేసిన పాపమేమొ?
అక్కసుతో క్రిమి దిక్కుల నెగబ్రాకి
ప్రాణాలు దిగమ్రింగి పట్టువిడక
పిచ్చిగా విహరించి పెట్రేగి యంతట
పీనుగ పెంటలన్ పేర్వ జేసె

తే.గీ. దేవ! కలియుగ దైవమా! దివ్యరూప!
వేంకటేశ్వరా! మమ్మేల వేగ రావ!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 73. మోదీపైన అనౌచిత్యమైన ప్రేలాపనలు

సీ. అంతుచిక్కని క్రిమి నంతము నొందింప
పూనె ధీరోదాత్త పూజ్యు డితడు
సకలజనులనుండి సంఘటితము కోరి
సమరశంఖము నూదె సజ్జనుండు
తగవులాడెడు మూర్ఖ లెగతాలి చేసినన్
పట్టువీడని దేశభక్తు డితడు
సత్సాంప్రదాయమున్ స్వాగతింపను జేసి
విశ్వసింపగ జేసె విజ్ఞు డితడు

తే.గీ. దుష్ట బుద్ధుల సలహాలు త్రోసివేసి
పోరుసల్పినారింటింట పౌరులిపుడు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 74. దుష్ప్రచారాలు

సీ. విశ్వమందలి వింత విజ్ఞానమందించె
మహనీయమైనట్టి మాధ్యమముల
యోచించి సరిగ ప్రయోజనాలకు కూర్చి
యున్నత శిఖరాల నొందవచ్చు
పుడమి నెల్లలదాక నడుగడ్గు వార్తలన్
కనుల ముందర నిల్పు కానవచ్చు
సంఘవిద్రోహమౌ సత్యదూరాలను
సృష్టించి ప్రజలకు చేరవేసి

తే.గీ. భయము కల్పించు మూర్ఖపు ప్రబుధులార
తగని బుద్ధిని విడనాడి తప్పుకొనుడు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 75. నిర్మానుష్యమైన దేవాలయాలు

సీ. భక్తుల హృదయాలు పసిగట్టి దేవుళ్ళు
గుడి గోపురాలను విడిచినారు
ప్రజల చెంతకు చేరి ప్రాణాలు రక్షింప
సంఘటితముగాను సాగినారు
వైద్యులై, రక్షక భటులునై, పరిశుద్ధ
కార్మికులై తాము కదలినారు
వివిధరంగాలలో విధులు నిర్వర్తించి
శ్రద్ధగా నునికిని చాటినారు
తే.గీ. వరములందించు పరమాత్మ దరుగుదెంచి
సేవకావృత్తులందున చేరి నిలిచె
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 76. కాలుష్యం తగ్గుట

సీ. అల్లకల్లోలాన నవని నెల్లను క్రిమీ!
దుర్మార్గమున కాలు దువ్వనేల?
ప్రజల మేలును కోరి పాలకుల్ తడయక
నాంక్షలు విధియించి రదుగడుగున
హద్దు దాటకనింట ముద్దుగా నుండిరి
పంచభూతములన్ని పరవశించె
జీవులెల్ల వనిలో స్వేచ్ఛగా విహరించె
ప్రాణభయములేక బ్రతుకుచుండె
తే.గీ. లాభనష్టాలు నీవల్ల లభ్యమయ్యె
తెగిన దాకను లాగుట తగదు తగదు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**77. సమయమంతా కుటుంబ సభ్యులతో గడుపుట**

సీ. ఉరుకులు పరుగులు బిరబిరా నడకలు
మెతుకులు గబగబ మెక్కుటాగె
ఆలుపిల్లలతోడ నానంద డోలిక
లందు నూగెడి కాలమరుగు దెంచె
విందువినోదాలు విచ్చలవిడి కర్చు
తగ్గి యింటి రుచికి మొగ్గుచూపె
పొదుపు మంత్రము నేర్పె పూర్తిగా పరిశుభ్ర
తనుగూర్చి పాఠాలు వినగ జేసె

తే.గీ. కాలు కదుపక నీ కలికాలమిటుల
సకలజనులు జీవించుట సాధ్యమౌన?
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**78. కనికరము లేకుండుట**

సీ. పసిపాప మొదలుగా పండుముసలినైన
కనికరమ్మును లేక కాటువేసె
బాధతో బంధువుల్ పార్థివ దేహాల
కడసారి చూపులు కానకాపె
క్షణకాల మంతట కాలకూటము జిమ్మి
యూహకందని రీతి నూపివేసె
విశ్వమున్ కబళించి విలవిలలాడించె
బలమేమిటో? దీని పంతమేమొ?

తే.గీ. పండుటాకులవలె మారి పతనమైరి
తెలియరాకున్నదీనాడు తేటముగను
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**౭౯. మోదీ ముందుచూపు, ట్రంప్ నిర్లక్ష్యాల ఫలితాలు**

సీ. వేదభూమిని మోది విశ్వవిపత్తును
కట్టడి జేసెను క్రాంతదర్శి
పొట్టిపామునునైన పొడవైన కర్రతో
హతముచేయు డనిన నార్య సూక్తి
సూక్ష్మదృష్టిని కాంచి లక్ష్మణరేఖలో
కుదురుగా బంధించి ముదము కూర్చె
విశ్వవిజ్ఞానిగా విర్రవీగిన ట్రంపు
ప్రాణాలు రక్షింప ప్రాకులాడె

తే.గీ. దూరదృష్టిని నెరుగక త్రోసివేసి
నేడు మూల్యము చెల్లించె నోడిపోయె
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**౮౦. వాయుదేవునికి విజ్ఞప్తి**

సీ. పంచభూతములందు ప్రభవించెనేమొకా
ప్రస్తుత స్థితి కాంచ విస్తుగొలిపె
అవనిపైనంత నిరాటంకముగ సాగి
ప్రాణాలు భక్షింప ప్రబ్బుకొనెను
ఆవురావురనుచు నాడించె నాల్కలన్
వేగమే తనవైపు లాగుకొనెను
కాలకింకరులోలె కంఠాల బిగియించి
యమపురికంపించె నరుగు డనుచు

తే.గీ. గంధవహము! యాక్రిమితోడ కలయుటేల?
హేయమని తోచకను ప్రోత్సహింపనేల?
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**81. శుభకార్యాలు ఆగిపోవుట**

సీ. యోగ్యులై యున్నట్టి యువతకు సౌభాగ్య
సంపదల్ సమకూర్చె సంబరములు
అర్ధాంతరమ్మున నాపజేసెను క్రిమి
దైవ నిర్ణయమని తలచి నారు
శ్రీకారమును చుట్టి సిద్ధాంతి నుడివిన
దివ్యముహూర్తముల్ తేలిపోయె
కళ్యాణ మాశించి కలలేమొ తలపోసి
యెదురు జూచిరి యెప్పు డెప్పు డనుచు
తే.గీ. నేటి దుస్థితి నాపెడు మేటి కొరకు
స్వాగతించిరి ప్రజలెల్ల వేగ రమ్ము
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**82. భారతీయ సదాచారము**

సీ. కర్మభూమిని నాటి ధర్మబద్ధములైన
సత్సంప్రదాయముల్ ఛాందసమని
ఆశ్చర్యమును గొల్పు పాశ్చాత్య పోకడల్
చిత్తానుసారము స్వీకరించి
కరచాలనమ్ములు గౌరవమ్ముగనెంచి
ఆలింగనాలతో హత్తుకొనిరి
అంటుమైలలనెల్ల నవివేకమని చాటి
మార్పునాశించుచు మసలుకొనిరి
తే.గీ. విశ్వమంతట క్రిమి నేడు వెర్రి మాన్పి
భరతసంస్కృతి నెరిగించె మరువకుడని
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**83. ప్రపంచానికి దిక్సూచి భారతదేశం**

సీ. ఆపద సమయమం దవనిని రక్షించె
దిక్సూచి భారత దేశమయ్యె
క్రూరాత్ములై నేడు పేరాశతో కూడి
విశ్వ విజేతలై వెలుగనెంచి
అంతు చిక్కని క్రిమి నంతట నుసిగొల్పి
చెల్లాటమాడించి సిగ్గులేక
రాక్షసానందాన వీక్షించు చుండగా
మారణహోమాల మంటలెగిసె

తే.గీ. రఘుకులాన్వయు డేలిన రాజ్యమందు
ఔషధాలను సృష్టించి యండ నిలిచె
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**84. వివిధ సంస్థలు స్థంభించిపోవుట**

సీ. సూక్ష్మాతి సూక్ష్మమై చూపులకందక
విశ్వమంతట నిండె విభ్రమముగ
జోరుగా కడదాక కోరలు చాచుచు
కూకటివ్రేళ్ళతో కుదిపివేసె
జనజీవనాలను స్థంభింపజేసెను
ఆనవాళ్ళెరుగక యదిరిపడుచు
విద్యాధిసంస్థలు వివిధరంగములన్ని
సాగక పూర్తిగా చతికిలబడె

తే.గీ. బిక్కు బిక్కున నింటిలో నక్కి యుండి
యెల్లదీసినామీకాలమెల్లరమును
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**85. సూర్యదేవునికి విజ్ఞప్తి**

సీ. ద్వాదశ రూపాల ధరణిపై వెలుగొందు
కశ్యపాత్మజ! ఘన కాంతిరూప!
సప్తాశ్వరథముపై లిప్తపాటైనను
వ్యర్థము పుచ్చక వఱలు దేవ!
శ్రీకరాలను చేర్చి జీవరాసులనెల్ల
బ్రతికించుచున్నట్టి భానుమూర్తి!
చీడపీడలనెల్ల చీల్చి చెండాడు నీ
శక్తి యుడిగెన? ప్రచండరూప !

తే.గీ. విగతజీవుల జేసెను తగులుకొనుచు
దీని నంతుచూడక నీదు మౌనమేల
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**86. హారము (బలి) తీసుకొనుట**

సీ. అడ్డునదుపులేక నరిబకాసురుడవై
సంచరించుటయందు సంగతేమి?
ఉలుకుపలుకు లేక యువ్వెత్తున నెగిసి
ప్రాణాలు హరియింప పరగుటేమి?
మంత్రదండముచేత మచ్చుకొల్పిన నాటి
మాయపకీరువా? ధ్యేయమేమి?
ఆకలి మంటచే నకనకలాడుచు
ప్రజల భక్షించు నీ పాడియేమి?

తే.గీ. దేశదేశాలు విహరించి దిగులు నింపి
హారమును గొనుచున్నది మేర మీరి
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 87. వలసకూలీలు - దురవస్థలు

సీ. తట్టబుట్టల కూర్చి పొట్ట చేతను బట్టి
ఆలిపిల్లలతోడ కూలికొరకు
పల్లెటూర్లను వీడి పట్టణాలకు చేరి
పూటగడ్పుచునున్న మోటు జనులు
ఆంక్షల మధ్యన నతలాకుతలమైరి
తలదాచుకొనుటకై దారిలేక
తిరుగు ప్రయాణమై దీనులై విధిలేక
కాలినడకచేత కదలిరిపుడు

తే.గీ. మార్గమధ్యన చిక్కులు మసలుచుండె
నెదురుకొనుచున్న నింటికి నేగుటెట్లు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 88. పాకిస్థాన్ వక్రబుద్ధి

సీ. ధర్మము నెరుగని దాయాది దేశము
పగతీర్చుకొనుటకై పగలు రాత్రి
ఉగ్రవాదుల కూర్చి యుసిగొల్పుచుండగా
నెదురొడ్డి సైనికు లెదురుకొనిరి
పాచిక పారింప ప్రస్తుత స్థితియందు
అనువుగా భావించి యడుగు లేసి
రోగగ్రస్తుల దెచ్చివేగమే భారత
భూభాగమునకంప బూనె నిపుడు

తే.గీ. వక్రబుద్ధి పాకిస్తాను పాలకులకు
ఉగ్గుతో కల్పి పెంచిరే సిగ్గులేక
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**౮౯. స్థబ్ధమై మరల రెచ్చిపోవుట**

సీ. నంగనాచి భువిని బుంగమూతిని బెట్టి
చిట్టిబుట్టనుచును చెంగునెగిరి
స్వైర విహారియై శక్తిరూపము దాల్చి
మనుషులన్ వెంటాడి మట్టుబెట్టె
వైద్యశృంఖలముల బంధింప బూనగా
అపహాస్యమును చేసి యాటలాడె
చిక్కక దొరకక లెక్కకు మించిన
ప్రాణులన్ బలిగొని ప్రాకులాడె

తే.గీ. మందుపారగా స్థబ్ధమై మాటువేసి
పిచ్చి వర్తనచేతను రెచ్చిపోయె
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**౯౦. చికిత్సకై బుజ్జగింపులు**

సీ. పరదేశులిచటకు చొరబడి రోగము
నంటింప సంకల్ప మందిరేమొ
ఛాందసవాదులన్ సభకు రప్పించిరి
భక్తిముసుగులేసి పరగుడనిరి
అల్లాయెమాకాజ్ఞ లందించెనని యెంచి
నేరుగా నూరూరు చేరుకొనిరి
పుడమి విధ్వంసులన్ బుజ్జగింపగనేల?
దండించి వెంటనే తరుమలేర?

తే.గీ. కొంపలను కూల్చనెంచిరీ కుట్రపరులు
దనుజులు చికిత్స కోరక దాగుకొనిరి
క్రూరమైనట్టి చైణనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**౯౧. ప్రజలే సైనికులు**

సీ. వింత కరోనాయె వికటాట్టహాసాన
విశ్వమున్ వణికించె విఱ్ఱవీగె
దృష్టికినందక యిష్టానుసారము
విహరించె నత్యంత వేగముగను
పిల్లపాపలనక నెల్లరి దేహాలు
కబళించుచున్నది కర్కశమున
మందుమాకులు లేక చిందులువేయుచు
మరణమృదంగమై మారుమ్రోగె
తే. అంతుచిక్కక వైద్యుల కవనిపైన
సకల జనులు సైనికులైరి సమరమునకు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**౯౨. విశ్వవిజేతలను గడగడలాడించుట**

సీ. బ్రంహ్మాండమును కూల్చె బాంబులన్ సృష్టించి
విశ్వమంతట విఱ్ఱవీగినారు
విశ్వాంతరాళాన వింతలన్ ఛేధింప
విజ్ఞానవంతులై వెలిగినారు
గ్రహకూటములపైన కాలూని జీవింప
తగిన యేర్పాట్లకై తరచినారు
మోసాలుచేయుచు మీసాలు మెలివేసి
పగలతో నిత్యము రగిలినారు
తే.గీ. కంటికగుపించకను సూక్ష్మ కణము భువిని
నేడు విశ్వవిజేతల నేడిపించె
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**93. సప్తపది (ప్రధాని సూచించిన ఏడు సూత్రాలు)**

సీ. క్లిష్టమౌ నీస్థితి నిష్టమౌ వృద్ధులన్
కంటికిరెప్పగా కావవలెను
ప్రాణాంతకమునుండి ప్రజలను రక్షించు
దేవతలన్ ప్రస్తుతించవలెను
అన్నార్థులను కాంచి యండదండగనుండి
తృప్తిగా నాకలి తీర్చవలెను
సకలసంస్థలయందు సాగునుద్యోగులన్
తొలగింప బూనక మెలగవలెను

తే.గీ. అందరారోగ్యసేతువు నాదరించి
శక్తి నింపుకొనుచు దవ్వు సైచుడనెను
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**94. అర్ధశతాబ్ది నుండి ఇటువంటి స్థితి తెలియకుండుట**

సీ. అర్ధశతాబ్దిగా నవనిపై నెవ్వరీ
స్థితినెరుగను లేదు జీవితమున
చంటిపిల్లలవోలె నింటిగుమ్మములోనె
నెల్లదీసెడి కాలమేగుదెంచె
వింతగా క్రిమినేడు విశ్వమంతటనిండి
వెనుదీయక తనదు యునికిచాటె
ధైర్యమున్ కోల్పోయి కార్యాలయములన్ని
విధులను మాన్పించె వేగముగను

తే.గీ. అల్లకల్లోలమై పోయి రెల్లరిపుడు
దిగులుమానుట యెన్నడో తెలియదిపుడు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**౨౫. కరోనా రాకతో లాభ నష్టాలు**

సీ. ఆసుపత్రులచుట్టు నారోగ్యహీనులు
తరలుచుండిరెపుడు విరివిగాను
వైద్యపరీక్షలన్ పట్టి జరుపవారు
సొమ్ముచేసుకొనిరి నెమ్మదిగను
నీరాకతో నేడు దూరమై పోయిరి
చీటికి మాటికి చేరుటేది?
స్థిమితమై మనసునన్ చింతలన్ వీడగా
ముదముతో నెల్లరు కుదుటపడిరి

తే. చాలుచాలును నీమేలు సంస్తుతింతు
హింసచేయుట నాపుము హీనముగను
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మినృసింహదేవ!

**౨౬. అల్పబుద్ధులైన కొందరు ఆపన్నహస్తులు**

సీ. అల్పబుద్ధులు కొంద రాపన్న హస్తము
లందింప బూని రాడంబరముగ
ప్రత్యేక శ్రద్ధతో నిత్యావసరములన్
సమకూర్చి పేదల స్వాగతించి
ప్రీతితో దరిచేరి చేతికందించుచు
ముసిముసినవ్వులన్ ముద్దులొలికి
సంతోషభరితులై ఛాయాది చిత్రాలు
చరవాణులకు పంపి చాటుకొనిరి

తే,గీ. రాజకీయలబ్ధిని కోరి మోజుతోడ
పంచిరే కాని నిజమైన భక్తిలేదు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మినృసింహదేవ!

**97. వందేళ్ల కొకసారి వస్తున్న భయంకరమైన వ్యాధులు**

సీ. కాలానుగుణముగా నేలపై నెప్పుడు
క్రిములుద్భవించుచు కెరలుచుండు
జీవులన్ వెంటాడి చిటపటలాడించి
కడతేరుచుండును క్రమముగాను
ముందుతరమునుండి వందేళ్లకొకసారి
సుందరంబగు భువిన్ చోద్యముగను
వివిధనామాలతో విశ్వమున్ ముంచెత్తు
ప్రాణాంతకవ్యాధి ప్రభలుచుండె

తే.గీ. గతములో ప్లేగు కలరాలు కలచివేసె
మరల నరుదెంచె నిప్పుడు మాయలాడి
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**98. అరికట్టలేక పోవుట**

సీ. వైద్యశిఖామణుల్ వలవేసి బంధింప
వశముకాకున్నది వసుధయందు
ఖండాంతరాలను చెండాడుచున్నది
పచ్చిరక్తము ద్రావి పరుగులిడెను
వడివడి యడుగులన్ తడబాటు లేకుండ
ఆగ్రహోదగ్రమై యలుముకొనెను
దిగ్దిగంతాలను దేశమ్ములేకమై
బంధింప జాలక బావురుమనె

తే.గీ. దీని యవతారమేమిటో తెలియదాయె
భువిని నంతట ముంచెత్త బూనెనిపుడు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**౯౯. స్వీయనిర్బంధము గడుపు పెంచుట**

సీ. కాలకూటమునుండి కాపాడుకొనుటకై
యెంచినిర్బంధమున్ పెంచినారు
ఇంటిగోడలమధ్య నంటిపెట్టుకనుండి
బల్లి నల్లులవంటి బ్రతుకు లాయె
వీధులన్ తిరుగక విధులలో సాగక
మూలలన్ విడువక ముడుచుకొనిరి
ముసుగుతో నిత్యము విసిగెత్తి మనసులో
భయము వీడనులేక బాధపడిరి

తే.గీ. దీని దుంపతెంపనులేక దిగులుతోడ
ప్రజలుతర్జనభర్జనల్ పడిరినేడు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**100. రోజు కూలీల గోడు**

సీ. కడుపుకెల్లకనింటి నడుగుదీయనులేక
గోడాడిరెందరో కూలిజనులు
భూతమై నుదుటిపై వ్రాతను చెఱపుచు
కడతేర్చె నేరుగా కాటికంపె
బ్రతికితే చాలును బలుసాకుతోనైన
గడుపవచ్చుననిరి జడుసుకొనిరి
అంబలి గంజితో సంబర పడి గొడ్డు
కారము మెతుకులు కలిపి తినిరి

తే.గీ. అంతకంతకు పెరుగగ నంతుదాక
పీడ విరుగడ కొరకయి వేడుకొనిరి
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 101. ప్రధాన ప్రోత్సాకులు శ్రీ కొత్త గోవర్ధన్ గారు

సీ. కొత్త గోవర్ధను చిత్తమందలి భావ
సుమముల నందించె శుభము కోరి
గోవిందు వంశాన గోవర్ధనాఖ్యుడన్
కూర్చితి పద్యాలు కోర్కెమీర
సహచరు లెల్లరి చరవాణులకు పంపి
ప్రోత్సాహమును పొంది పూర్తిగాను
శతకము పూరించి సాహితీప్రియులకై
ముద్రింప దలచితి మోదమలర

తే.గీ. తేనె లొలికించు ఘనమైన తెలుగు భాష
వీనులకు విందు నొనరించు వేదవేద్య!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

### 102. సాహితీ ప్రియుల ప్రోత్సాహం

సీ. శ్రీనివాసులు రాధ శ్రీదేవి కాశన్న
రవికిరణులు నాదు కవనమునకు
ఎనలేని తోడ్పాటు మనసారనందించి
తడబాటు లేకుండ నడుగిడనిరి
కొండంత యండతో దండాలనందించి
విశ్వాసమునుపొంది వెనుదిరుగక
నిష్ఠా గరిష్ఠునై నేర్పుగా మకరంద
సీసాల సుమములన్ చేరదీసి

తే.గీ. తగిన గజమాలనల్లితి నగుమొగమున
సరస సాహితీ ప్రియులెల్ల చదువ వలెను
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**103. స్వామికి కృతజ్ఞతలు**

సీ. దండాలు! దండాలు! దనుజారి! నరసింహ!
వెన్నుతట్టితివయ్య! విశ్వవినుత!
దెందాన నెలకొని ముందుకు నడిపించి
విశ్వమందీనాటి వింతలెల్ల
హృదయానికందించి కుదురుగా భావాలు
నెమరువేయగచేసి నేర్పుతోడ
కమనీయ సీసాల సుమమాల కూర్పించి
నీపాదపద్మాల నిలిపినావు

తే.గీ. జన్మ ధన్యమైపోయెను సారసాక్ష!
మదిని కడదాక విడువ మీ స్మరణ నెపుడు
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**104. స్వామిని భూలోకమును వీక్షింపుమని వేడుకోనుట**

సీ. ఆదిలక్ష్మీశ! మా యండదండను మీరె
విశ్వాత్మకా! దేవ! విష్ణురూప!
శ్రీపరాత్పర! రార! చెంచులక్ష్మీశ! మా
వేదనల్ తొలగించు వేదవేద్య!
వింతగా క్రిమినేడు విశ్వమున్ వ్యాపించె
విలయతాండవమాడె విశ్వనాథ!
నీగోళ్ళతో కుక్కి నిర్మూలనముచేసి
నీశక్తి నెరిగించు నీరజాక్ష

తే. రావదేలను? మమ్మేల రత్నదీప!
అరయ నరుదెంచ రీ భువిన్ మరచినార!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**105. అభద్రతా భావం తొలగించుమని వేడుకొనుట**

సీ. గర్జనల్ కురిపించి గడగడ వణికించి
ధరణిపై నీక్రిమిన్ తరుమలేర?
సాంద్రమైనట్టి మీ చల్లని చూపులన్
ప్రసరింప చేయరా దెసలదాక?
భయము తోడను నేడభద్రత భావాన
విలవిల లాడెను విమలచరిత!
వేగమే యరుదెంచి వెన్నును తట్టుచు
ధైర్యము నందింప తలపులేద?
తే.గీ. సకలలోకాధిప! భువికి సాగిరార!
నేటి వికలత్వమును మాన్పునెనరుతోడ!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**106. వేనవేల వినతులు**

సీ. హే పరాత్పర! దేవ! యో పరంధామ! శ్రీ
వైకుంఠ పురవాస! వాసుదేవ!
సకలచరాచర సర్వాంతరంగముల్
వ్యాపించియున్నట్టి వారిజాక్ష!
నారాయణా! జగన్నాటకసూత్ర! మా
పాలిదైవమ! రార! పరమపురుష!
లోకసంరక్షకా! మోకరిల్లితిమయ్య!
ముక్తి ప్రసాదించు భక్త వరద!
తే.గీ. కల్ప వృక్షమా! మాపాలి కామధేను!
వేనవేలుగ వినతులన్ వినగలేవ!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**107. పదునాల్గు భువనాల ప్రత్యక్ష దైవము**

సీ. ఏరూపమునుదాల్చి యేలోకమందున
విహరించుచున్నావు విశ్వనాథ!
పదునాల్గు లోకాల ప్రత్యక్ష దైవమా!
మొరలాలకించిన పరమరూప!
గజరాజవరద! యో కమలాంతరంగమా!
నీలమేఘశ్యామ! నీరజాక్ష!
అడుగడుగున భువి నిడుముల నెడబాపె
పరమదయాకర! పాహి! పాహి!

తే.గీ. ప్రాణసంకట మాయెను పలుకవేల?
మమ్ము రక్షింప భారమా? మందహాస!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

**108. ముగింపు**

సీ. శుభ మంగళము నీకు సురలోక పూజిత!
ధరణిని రక్షించు ధర్మతేజ!
అచ్యుతా! గోవింద! యభవుడా! నరహరి!
ఆనందనిలయుడా! యసురవైరి!
అసమాన తేజుడా! అభయప్రదాత! మా
యార్తిని తొలగించు కీర్తిసాంద్ర!
ముగ్ధమనోహర! మునిజన వందిత!
సంకటాల్ హరియించు సారసాక్ష!

తే.గీ. ఆదిమధ్యాంతరహితుడా! యాత్మరూప!
సుజనులందున నెలకొన్న శుభకరుండ!
క్రూరమైనట్టి చైనా కరోన నణచి
చింతలెడబాపు లక్ష్మీనృసింహదేవ!

## ఫలశ్రుతి

సీ. శ్రీపరాత్పరుడైన శ్రీలక్ష్మినరసింహ
దేవుని నమ్మిన దిగులు మాన్పు
సృష్టిలో నంతట దృష్టిని పారించి
భక్తులన్ రక్షించి భద్రమొసగు
క్రూరాత్ము లసురుల కోరలన్ పెకలించి
కరనఖంబులచేత గాసిచేయు
ఆత్మాభిరాముడై యండదండగనుండి
సుఖము సంతోషాల శుభము కూర్చు

తే.గీ. రక్షరేకుగా వెలుగుచు రాత్రిపగలు
హృదయమందున నిలుచును కుదుట పరచు
వ్యాధిభూతంబులన్నిటిన్ వణక జేసి
దరికి నరుదెంచ నీయక తరుమునెపుడు.






## శ్రీమతి కాశింశెట్టి విజయలక్ష్మి (గురుమాత)

వ్యవస్థాపక ధర్మకర్త
శ్రీ లక్ష్మీ నృసింహ దేవాలయం, నాగర్ కర్నూల్

కం. ధరణిని సంరక్షించిన
నరసింహుని దివ్యమైన నామజపమునే
మరువని విజయమ్మా! నా
మొర దయతో వినుము తల్లి మ్రొక్కెద మీకున్.

కం. గురుమాతా! యనునిత్యము
పరిపరి విధములను భక్త వరు లర్థింపన్
దరి జేరిన కంటకముల
తరుముచు నున్నట్టి తల్లి! దండము మీకున్.

కం. నరసింహుని నామామృత
మరసితి హృదయంబునం దహర్నిశ లెపుడున్
మరుమల్లెల సీసమ్ముల
సరమును కూర్పించె జన్మ సఫలము చేసెన్.



కీ.శే. శ్రీ గోవిందు సాయిలు, కీ.శే. శ్రీమతి నారమ్మ



**కృతికర్త** : గోవిందు గోవర్ధన్

**జననం** : 15-6-1969

**పితరులు** : శ్రీ గోవిందు సాయిలు, శ్రీమతి నారమ్మ

**స్వగ్రామం** : పాలెం

**విద్య** : ఎం.ఏ, టిపిటి

**వృత్తి** : అధ్యాపకత్వం
శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ డిగ్రీ కళాశాల
పాలెం-509215. నాగర్‌కర్నూల్ జిల్లా,

**పద్య గురువు** : డా॥ వెలుదండ సత్యనారాయణ గారు

**అభిరుచులు** : ఆధ్యాత్మిక చింతన, పద్య రచన

**రచనలు** : 1. పాలెము వేంకటేశ శతకం
2. పాలెము ప్రసన్నాంజనేయ శతకం